అంబేద్కర్ ధమ్మదీక్షా స్వీకరణకి 65 సంవత్సరాలు

## భారతదేశ విముక్తి మార్గం

# బౌద్ధం

(బాబా సాహెబ్ అంబేద్కర్ ఐదు బౌద్ధ ప్రసంగాలు)




మూలం
డా॥ బి.ఆర్. అంబేద్కర్

స్వేచ్ఛానుసరణ
గౌరవ్

# అంబేద్కర్ ధమ్మదీక్షా స్వీకరణకి 65 సంవత్సరాలు

# భారతదేశ విముక్తి మార్గం: బౌద్ధం

## (బాబాసాహెబ్ అంబేద్కర్ ఐదు బౌద్ధ ప్రసంగాలు)

మూలం

**డా॥ బి.ఆర్. అంబేద్కర్**

స్వేచ్ఛానుసరణ

**గౌరవ్**

ప్రచురణ

**అక్టోబర్ 14, 2021**

(అంబేద్కర్ ధమ్మదీక్షా స్వీకారానికి 65 సంవత్సరాలు)

ముఖచిత్రం

**బాబాసాహెబ్ అంబేద్కర్ స్వయంగా వేసిన 'కనులు తెరచిన బుద్ధుడు'**



ప్రతిపాదిత విరాళం

**ఐచ్ఛికం**

సహకారం

**ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం**

వివరాలకు

gouravmeka@gmail.com

# అంకితం



తిరుగులేని కుల నిర్మూలనావాది,

విశేష జ్ఞాన సంపన్నుడు,

సమరశీల సంఘ సంస్కర్త,

ఆధునిక నవబౌద్ధుడు,

అంబేద్కర్‌ని ఆకర్షించిన నేత

భావోద్యమాల స్ఫూర్తిదాత

'ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు' కి

# ఇందులో...

డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ బౌద్ధ ధమ్మ స్వీకరణ చేస్తూ, బౌద్ధులయినవారు ఆచరించాల్సిన 22 ప్రతిజ్ఞల్ని ఐదు లక్షలమందిచేత చేయించారు. అవి;

1. నేను బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల్నీ, వేరే దేవుళ్ళనీ విశ్వసించను, పూజించను.
2. రాముడు, కృష్ణుల్ని దేవుళ్ళుగా భావించను, పూజించను.
3. హిందూ దేవుళ్ళను, దేవతలను విశ్వసించను, పూజించను.
4. దేవుడి అవతారాలను విశ్వసించను.
5. బుద్ధుడు విష్ణువు అవతారమని విశ్వసించను.
6. శ్రాద్ధ కర్మలు జరపను, పిండాలు పెట్టను.
7. బ్రాహ్మణులతో ఎలాంటి కర్మకాండలు, క్రతువులు జరిపించను.
8. బౌద్ధ ధమ్మానికి విరుద్ధమైన పనులేవీ చేయను.
9. మానవులందరూ సమానమేనని నమ్ముతాను.
10. సమసమాజ స్థాపనకోసం కృషి చేస్తాను.
11. అష్టాంగ మార్గాన్ని అనుసరిస్తాను.
12. దశపారమితుల్ని పాటిస్తాను.
13. సమస్త జీవులపట్ల సమతా, కరుణ కలిగి ఉంటాను.
14. దొంగతనం చేయను.
15. వ్యభిచారం చేయను.
16. అబద్ధం చెప్పను.
17. మద్యం తదితర మత్తు పానీయాలు సేవించను.
18. శీల, కరుణ, ప్రజ్ఞల్ని సాధన చేస్తూ నేను సమాజాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దుదాను.
19. అసమానతలతో నిండి, మానవాళి వికాసానికి విరుద్ధమయిన హిందూ మతాన్ని వదిలి బౌద్ధ ధమ్మాన్ని స్వీకరిస్తున్నాను.
20. బౌద్ధ ధమ్మమే సరయినదని నమ్ముతున్నాను.
21. హిందూ పునర్జన్మ సిద్ధాంతాన్ని నమ్మను.
22. ఇకపై నేను బౌద్ధధమ్మ జీవన విధానాన్నే అవలంబిస్తాను.

# అనువాదం కాదు, అంతర్మథనం!

డి.సి. అహిర్ ఆధ్వర్యంలో బ్లూమూన్ బుక్స్ ప్రచురించిన 'ఎంపిక చేసిన అంబేద్కర్ ప్రసంగాలు' పుస్తకంలో మొత్తం 18 ఉపన్యాసాలు ఉన్నాయి.[1] మహద్ సత్యాగ్రహంతో మొదలెట్టి, దేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, రాజ్యాంగ నిర్మాణ సందర్భంగా ఇచ్చినవి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం గురించీ, ఇంకా బౌద్ధం కోసం. వీటిలో సూటిగా బౌద్ధానికి సంబంధించిన అయిదు ప్రధాన ప్రసంగాల్ని ఎంచుకుని, 'అంబేద్కర్ బౌద్ధ ధమ్మ స్వీకారానికి 65 సం॥రాలు పూర్తైన సందర్భంగా' వాటిని తెలుగులోకి అనువదించి తీసుకొస్తున్న చిన్న పుస్తకం ఇది.

ఈసరికే తెలుగులో ఇవి ప్రచురించి ఉండవచ్చు, తెలుగులో కూడా వివిధ ప్రగతిశీల సంస్థలు, బౌద్ధ – అంబేద్కరిస్ట్ సంఘాలు పనిచేస్తున్నాయి కాన ఈ ప్రసంగాల్ని తెలుగు చేసి ఉండవచ్చును. మరి అలాంటప్పుడు ఈ ప్రయత్నం ప్రయాస కాదా? ప్రజాహితం కోసం చేసే ఏదీ వృధా కాదనేదే నా నిశ్చితాభిప్రాయం. కోవిడ్ కాలంలో కోల్పోయిన ఆత్మీయుల స్మృతులు మదిలో సుడులు తిరుగుతూ నిరంతరం నిస్తేజానికి లోనుచేస్తూ నిరాశపరుస్తున్నప్పుడు, అంతశ్చేతనకి లోబడి సాగిన అడుగుజాడలే అప్పుడప్పుడు వికసిస్తున్న ఈ అక్షరాలు.

అందులో భాగంగా దాదాపు దశాబ్దం క్రితం కొని చదివిన అహిర్ ప్రచురణ ఆంగ్ల పుస్తకంలోని ఐదు అంబేద్కర్ ప్రసంగాల్ని అనువదించాలని అనుకున్నాను. అనువాదం త్వరగానే అయిపోయింది గానీ మిగిలిన పనులకి సమయం పట్టింది. అయినప్పటికీ ఒక చారిత్రక సందర్భాన్ని పురస్కరించుకుని ఇదిలా తీసుకురావడం సంతృప్తిని ఇస్తోంది. నేను ఏ సంఘంలోను ప్రత్యక్షంగా ప్రస్తుతం లేను. సాధారణ సామాజిక కార్యకర్తగా, సాంస్కృతిక పునర్వికాసం కోసం నిబద్ధత గల ఆలోచనలే, బౌద్ధం గురించిన నా ఆసక్తికి ప్రధాన కారణం. అందుకనే మొదట్నుంచీ నా కార్యాచరణలోనూ రచనల్లోనూ బౌద్ధానికి ప్రాధాన్యత ఇస్తూనే ఉన్నాను. అందువల్లనే భావోద్యమాలలో బౌద్ధోద్యమం కూడా విశిష్టమయినదనే భావన నాది.

---

1. Selected Speeches of Dr. B.R. Ambedkar, presented by : D.C. Ahir, Blumoon Books, New Delhi, First Published : 1997, Reprint : March 2000.

ఆ నా పరిమితులకి కట్టుబడి స్వతంత్ర శోధన, అధ్యయనం, రచనా వ్యాసంగం, సాహిత్య ప్రచురణ, భావజాల ప్రచారోద్యమాలు, భౌతిక కార్యాచరణలో భాగంగా సభలు, సమాలోచనా సదస్సులు గతంలో చేసేవాడిని. ప్రస్తుత సంక్షోభ కాలంలో ఏవో కొద్దిపాటి కూడదీతలే కానీ భౌతికంగా ఎక్కువ చేయలేకపోతున్నాను. ఆ బాధ నన్ను వ్యక్తిగతంగా ఎంతో కలచివేస్తోంది. సమాజ నిర్మాణంలో యువత లేని కొరత కూడా బాధ కలిగిస్తోంది. ఆ ఒత్తిడిని తట్టుకోలేక వ్యక్తిగత కార్యాచరణని నిర్దేశించుకోవడం ఎప్పటికప్పుడు అలవాటు చేసుకున్నాను. అలా చేసిందే ఈ అనువాదం కూడా.

కాన ఈ కృతి ఆసక్తి ప్రధానంగా చేసిందే కాని ప్రత్యేకమయిన అభ్యాసం నాకేమీ లేదు. అనువాదంలోని దోషాలకు, వాక్య నిర్మాణలోపాలకూ పూర్తి బాధ్యత నాదే. ఒకట్రెండుచోట్ల తప్పా మూలంలో ఎక్కడా స్వతంత్రించలేదు. అలాగే కొన్నిచోట్ల ధమ్మ అనీ ధర్మ అనీ పాళీ, సంస్కృతాలు రెంటినీ వాడాను. బిక్కువు, బిక్షువు వంటి పదాల్లో కూడా ఈ పొరపాటు కనిపిస్తుంది. అలవాటైన భాష అంటురోగం వంటిది, అంత త్వరగా వదలదు. అటువంటివే కానీ, మూలంలోని సారం చెడకుండా అనువదించడానికి ప్రయత్నం చేసాను, అదెంత వరకూ సఫలీకృతమైందో చెప్పాల్సింది చదువరులే.

మరొక ముఖ్య విషయాన్ని ప్రస్తావించాలి. మూల గ్రంథంలోని ప్రసంగాల వరుస క్రమంలో మొదట అంబేద్కర్ కొలంబోలో చేసిన ప్రసంగం "భారత దేశంలో బౌద్ధ పతనం" అనేది ఉంది. అయితే ఇదే అంశంపై బి.ఆర్. అంబేద్కర్, రాహుల్ సాంకృత్యాయన్‌ల వ్యాసాల్ని గత సంవత్సరం నేను అనువదించీ సాఫ్ట్‌కాపీగా ప్రచురించడం జరిగింది.[2] కాన సంక్షిప్తమైన అంబేద్కర్ కొలంబో ప్రసంగాన్ని ఇందులో చేర్చలేదు. అలాగే కలకత్తా నుంచి ప్రచురించబడే 'మహాబోధి' బౌద్ధ పత్రికలో అంబేద్కర్ రాసిన 'బుద్ధుడు; ఆయన మతం యొక్క భవిష్యత్తు[3], ఇంకా అంబేద్కర్

---

2. The Decline and Fall of Buddhism in India, Dr. B.R. Ambedkar, Rahul Sankrityayan, Blumoon Books, New Delhi, Published : 2000. ఈ పుస్తకాన్నే 'భారతదేశంలో బౌద్ధ పతనం' పేరిట ఏప్రిల్ 2020లో అనువదించాను.

3. Buddha and Future of His Religion, Dr. B.R. Ambedkar, 'Maha Bodhi'; Maha Bodhi Society Journal, Calcutta; Vaishakhi, Vol : 58, May 1950.

రేడియో ప్రసంగాలు (సాంఘిక తత్వశాస్త్ర భావాలు) ముగ్గురు గురువులు, మూడు దైవత్వాలు వంటివి నేను తీసుకోలేదు.[4]

బౌద్ధానికి సంబంధించినంతవరకూ ఈ ఉపన్యాసాలు ముఖ్యమయినవని తోచడం, శారీరక మానసిక అశక్తత దృష్ట్యా నా పరిమితులు, ఆర్థిక ఇబ్బందులూ అన్నీ కలిపి ఇందుకు కారణమయ్యాయి. అసలు అంబేద్కర్ మొత్తం ప్రసంగాల్ని తెలుగుచేసి ప్రచురించాలనే కోరిక ఎప్పటికయినా నెరవేరుతుందని ఎదురుచూసాను. అనేక కారణాలవల్ల ఇప్పటికైతే వీటికే పరిమితమవ్వడం జరిగింది. బౌద్ధ తాత్వికతతోనే తప్పా ఇప్పుడున్న బౌద్ధ సంఘాలనబడే వాటితో నాకు సంబంధం లేదు. కాన వాటి నిర్దేశిత భాష, భావాలకు భిన్నంగా ఈ కృతి ఉండవచ్చు. భిన్నత్వం నేరం కాదు. బౌద్ధ ధమ్మ బలోపేతానికీ, ప్రజాతంత్ర భావజాల నిర్మాణ ప్రయత్నాలకీ ఈ కృతి కించిత్తు ప్రోత్సాహాన్నిచ్చినా అంతకు మించిన సార్థకత దీనికి మరేదీ లేదు, విమర్శలకు ఆహ్వానం, సెలవు.



4. On Social Philosophy, In a talk on the All India Radio, Delhi in the Series 'My personal Philosophy' on 3 October, 1954. Three Gurus And Three Deities'. Selected speech of Dr. B.R. Ambedkar, Prsented by D.C. Ahir, Blumoon Books, New Delhi, Pages 101, 102.

# 1. భారతదేశ జాడ్యాలకు జవాబు: బౌద్ధమే

*మే 20, 1951న బుద్ధ జయంతి సందర్భంగా న్యూఢిల్లీలోని అంబేద్కర్ భవన్‌లో గొప్ప కార్యక్రమం జరిగింది. ఇండియాలోని ఫ్రెంచ్ రాయబారి హెచ్.ఇ.ఎం. డేనియల్ లేవీ అధ్యక్షత వహించిన ఈ సమావేశంలో ప్రపంచంలోని అనేక బౌద్ధ దేశాల నుండి దౌత్యవేత్తలు పాల్గొన్నారు. అలాగే ఢిల్లీలోని బౌద్ధ భిక్షువులు హాజరయ్యారు. ఆనాటి భారీ సభనుద్దేశించి డా॥ బి.ఆర్. అంబేద్కర్ చేసిన ప్రసంగం ఇది;*

గౌరవనీయ అధ్యక్షుల వారికి,

ప్రియమైన సోదరసోదరీమణులకు,

గతేడాది ఇదే పవిత్ర దినాన సంతోషాన్ని పంచుకోడానికి మనం కలుసుకున్నప్పుడు ఇంతమంది జనం లేరు. కానీ ఈ ఏడు సంతృప్తికరమయిన సంఖ్యలో వచ్చారు. నిన్నటి రోజున ప్రజలు స్వచ్ఛందంగా భారీ ఊరేగింపు కూడా చేసారని వార్తాపత్రికలో చదివి నేను చాలా సంతోషించాను. ఏడాది కాలంలో మీలో ఈ విధమయిన పురోగమనాన్ని చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంది.

మనం బుద్ధ జయంతిని ఉత్సవంగా జరుపుకుంటున్నామంటే, అందుకు ప్రత్యేకమయిన కారణం ఉంది. గొప్పవాడయిన బుద్ధుడి జన్మదినాన్ని జరుపుకోవడం గొప్ప విషయం కాదు, ఎందుకనంటే గొప్పవారైన వారంతా గౌరవించబడతారు. కానీ, మనం ఎందుకు బుద్ధ జయంత్యుత్సవాన్ని జరుపుకుంటామంటే, అలా చేయడం ద్వారా భారతదేశంలోని సామాజిక జాఢ్యాలు నిర్మూలించబడతాయి కనుక.

హిందూత్వంలో, ఖండించాల్సిన అంశం ఏమిటంటే, అది ప్రజల్ని కృత్రిమంగా విభజించే చాతుర్వర్ణ వ్యవస్థపై ఆధారపడి ఉంది. నేను హిందూలకి నొక్కి చెప్పేదేమంటే, కుల వ్యవస్థను నిర్మూలించకుండా ఈ సామాజిక జాడ్యాలేవీ కూడా తొలగిపోవు. కులమనే జాడ్యాన్ని వదిలించుకోడానికీ, అలాగే ఇతర సామాజిక రుగ్మతల్ని అధిగమించడానికీ, నైతికత, సమానత్వం, సౌభ్రాతృత్వాల పునాది గల బౌద్ధాన్ని భారతదేశం ఆశ్రయించాలి.

బుద్ధుడు ఎన్నడూ కులవ్యవస్థని నమ్మలేదు. కులానికి బుద్ధుడు బద్ద శత్రువు, అలాగే సమానతకి సర్వదా బద్ధుడైనవాడు బుద్ధుడు. “మనుషులంతా సమానమే”

అన్నారాయన. మనిషికీ మనిషికీ మధ్య హెచ్చుతగ్గులేవీ లేవు. నీరు, అది గంగానదిలోదయినా, యమునా నదిలోదయినా, మురికి కాల్వలోదైనా సముద్రంలోకి వచ్చి కలవగానే సముద్రపు నీరైపోయినట్లుగానే భిన్నరకాల వ్యక్తులంతా బౌద్ధ మతంలోనికి ప్రవేశించగానే సమానులౌతారు. ఆయన ధర్మంలో అందరూసమానమే. బుద్ధుడు సర్వసమూహాల నుండి భిక్షువుల్ని స్వీకరించాడు.

బౌద్ధం ఎడల ఆధునిక బ్రాహ్మణులు అవలంభిస్తున్న వైఖరి నన్ను ఆశ్చర్యపరుస్తోంది. వారికి ఏమైంది? బుద్ధుని కాలంలో బౌద్ధాన్ని అవలంభించే వారిలో తొంభైశాతం మంది బ్రాహ్మణులే కాగా ఈరోజు భారతదేశం బౌద్ధానికి పునరంకితం ఐతే వీరెందుకు ఇంతలా వ్యతిరేకిస్తున్నారు? వారు తమ దృష్టినీ, విధానాన్నీ మార్చుకుంటారని ఆశిస్తున్నాను. నాగరిక హిందువులు కులరహిత – వర్గరహిత సమాజాన్ని విశ్వసించీ, ఆశించే వారయితే కనుక అటువంటి పటిష్టమయిన తాత్విక పునాదులు గల బౌద్ధానికి వారు దూరంగా ఉండటంలో అర్థం లేదు. నా ఉద్దేశం ప్రకారం భారతదేశ సామాజిక, ఆర్థిక రుగ్మతలన్నింటినీ బౌద్ధం నయం చేయగలదు. ఐతే కులమనే అడ్డుగోడ నిలిచి ఉన్నంతకాలం భారతదేశం అలనాటి ఆ పూర్వవైభవాన్ని తిరిగి పొందలేదు. ధర్మానుసారం బుద్ధుడు బోధించిన నైతిక సూత్రాలయిన స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వాల్ని పాటిస్తూ, ప్రజానీకం బౌద్ధం వైపు మరలినప్పుడే భారతదేశం తిరిగి కీర్తిప్రతిష్టలు పొందగలుగుతుంది.

భారతదేశంలో ఒకప్పుడు అత్యున్నతంగా వెలుగొందిన బౌద్ధాన్ని తిరిగి పునరుద్ధరించడానికి నేను కట్టుబడి ఉన్నాను. లక్షలాదిమంది పేద ప్రజలకి ముఖ్యంగా, అణగారిన పీడిత వర్గాలకి బౌద్ధ స్వీకారమే సాంఘికోద్ధరణకి ఏకైక మార్గం. అదే వారిని సామాజిక రుగ్మతల నుండి విముక్తి చేసే సాధనం. దీనికి మిగిలిన హిందూ సమాజం సహకరించకపోతే, షెడ్యూల్డ్ కులాలుగా మాకు మేమే స్వతంత్రంగా, బౌద్ధానికి గల కీర్తి ప్రతిష్టల్ని, గత వైభవాన్ని దాని జన్మభూమిలో తిరిగి తీసుకురావడానికి గానూ మా వంతుగా శక్తివంచన లేకుండా ప్రయత్నించి పురోగమిస్తాం.

✻ ✻ ✻ ✻ ✻

- *Buddha Vihara, New Delhi, 1951, Papers; Indian News Chronicle, 22 May, 1951*

# ౨. భారతదేశంలో బౌద్ధ పునరుద్ధరణకు ఇదే సరైన సమయం

*డిసెంబర్ 1954 మొదటి వారంలో డా॥ అంబేద్కర్ మూడవ ప్రపంచ బౌద్ధ సహృద్భావ సమావేశానికి బర్మా (నేటి మయన్మార్) వెళ్ళడం జరిగింది. రంగూన్‌లో నాటి సభని ఉద్దేశించిన ఆయన ప్రసంగం ఇది;*

విశిష్టమయిన ప్రతినిధులు,

లేడీస్ అండ్ జంటిల్‌మెన్,

నేను అత్యంత బాధతో, వేదనతో పేర్కొంటున్న విషయం ఏమంటే, ఎక్కడయితే మహాత్ముడయిన బుద్ధుడు జన్మించాడో ఆ నేలమీదనే బౌద్ధం పతనం అయ్యింది. ఇది ఎలా జరిగిందనేది ఎవరికయినా ఊహాతీతమయిన విషయం.

(ఈ మాటలంటున్నప్పుడు ఆయన కన్నీళ్ళుపెట్టుకున్నాడు. కొద్దిసేపు ఏమీ మాట్లాడలేకపోయాడు, కొన్ని నిమిషాల తర్వాత తేరుకుని, తనని తానే సముదాయించుకుని మళ్ళీ చెప్పడం మొదలెట్టాడు...)

భారతదేశంలో బౌద్ధం నిర్మూలించబడినప్పటికీ, హిందూత్వంపై అది గొప్ప ప్రభావం కలిగించింది. ప్రాచీన కాలంలో బ్రాహ్మణులు స్వర్గప్రాప్తికోసం విశేషంగా గోవుల్ని వధించి బలిచ్చేవారు. ప్రేమ, దయ, కరుణ, సద్భావం వంటి బుద్ధుని బోధనలతో ప్రభావితమై బ్రాహ్మణులు ఆ రక్తపాత జంతుబలుల్ని పూర్తిగా ఆపేయడం మాత్రమే కాదు, గోవధకి వ్యతిరేకంగా ప్రచారం కూడా చేస్తున్నారు. బుద్ధుని బోధనల్లో ప్రధానమైనటువంటి అహింస తత్వం ఆచరణాత్మకంగా సాధించినటువంటి అత్యున్నత విజయం ఇది.

బ్రాహ్మణులు అసంఖ్యాక దేవుళ్ళని, దేవతల్ని సృష్టించారు కానీ ఆ వేలాది దేవీదేవతల్లో ఎవరు తమని స్వర్గానికి తీసుకెళ్లగలరో వారికి తెలీదు. అందువల్ల వాళ్ళు అందరు దేవుళ్ళ చుట్టూతా అలా తిరుగుతూనే ఉంటారు. హిందూత్వంలా బౌద్ధం స్వర్గం గురించి నొక్కి చెప్పదు. బౌద్ధానికది అవసరం లేదు. ఆనందంగా జీవించడానికిగానూ విలువలతో కూడిన నైతికతను, సమానతను, సౌభ్రాతృత్వాన్ని అంతా పాటించాలనేది బౌద్ధం. ఇది బుద్ధుడు బోధించిన శాశ్వత సత్యం.

భారతదేశంలో బౌద్ధం పునర్వికాసం పొందాలనేది నా ఆతృత. ఆ దిశగా ఈసరికే నేను కొన్నిప్రయత్నాలు కూడా చేసాను. నేను భారత రాజ్యాంగ నిర్మాణకర్తను. నేను రూపొందించిన రాజ్యాంగంలో పాళీ భాషని బోధించడం గురించి చేర్చాను. అలాగే భారతదేశ జాతీయ పతాకంలో బౌద్ధ ధర్మచక్రాన్ని చేర్చాను. ఇంకా సారనాథ్‌లోని అశోక స్థూపం మీది నాలుగు సింహాల చిహ్నాన్ని భారత రాజముద్రగా స్వీకరించాను. సంతోషకరమయిన విషయం ఏమిటంటే ఈ ప్రతిపాదనలేవీ కూడా రాజ్యాంగ నిర్మాణ సభలో ఏ సభ్యుడిచేతా వ్యతిరేకించబడలేదు.

అజంతా ఎల్లోరాలకి దగ్గరలో ఔరంగాబాద్‌లో నేనో కళాశాలని స్థాపించాను. ఈరోజు 2900 మంది విద్యార్థులు బొంబాయిలోని సిద్ధార్థ కళాశాలలోను, 500 మంది విద్యార్థుల ఔరంగాబాద్ కళాశాలలోనూ చదువుకుంటున్నారు. వారిలో ఏ విద్యార్థి ఐతే బుద్ధుడి జీవితానికి సంబంధించీ గొప్ప వ్యాసాన్ని రాస్తారో వారికి వెయ్యి రూపాయల పురస్కారం లభిస్తుందని నేనిదివరకే ప్రకటించాను. విద్యార్థుల్ని బౌద్ధం అధ్యయనం చేసేందుకు ప్రోత్సహించడమే దీనికి గల కారణం. కాన సహజంగానే ఈ పద్ధతి బౌద్ధ వికాసానికి తోడ్పడుతుంది. ఇక్కడ నేను చెప్పదలచుకున్న మరో విషయం ఏమిటంటే, ఈ కళాశాలల్ని నెలకొల్పడానికిగానూ నేను భారత ప్రభుత్వం నుంచి 22 లక్షల వరకూ రుణం తీసుకున్నాను. నా జీవితకాలంలో ఈ అప్పుని తీర్చగలనా అనే సందేహం ఉంది. అయినప్పటికీ ఇంకా నేను ఢిల్లీ, బొంబే, కలకత్తా, మద్రాస్ మొదలైన చోట్ల, ప్రజానీకం మహాత్మా బుద్ధునికి నివాళులు అర్పించడానికి అనువుగా అనేక బౌద్ధారామాల్ని నిర్మించేందుకు ప్రణాళికతో సమాయత్తం అవుతున్నాను. ఈ విధంగా బౌద్ధాన్ని భారతదేశంలో వ్యాప్తి చేయడానికి నేను ఆలోచిస్తున్నాను.

ప్రస్తుతం భారతదేశం బుద్ధుడి సందేశాన్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉంది. నిజానికి, ఈరోజు ప్రపంచంలో ఒక్క భారతదేశంలో మాత్రమే బౌద్ధ ప్రచారానికి వాతావరణం అనుకూలంగా ఉంది. నేను బలంగా చెప్పదలచుకున్నది ఏమిటంటే, ఎలాగైతే బర్మా, శ్రీలంక, ఇంకా ఇతర దేశాలలో పవిత్ర బౌద్ధారామాల వికాసానికి, విస్తరణకి, నిర్వహణకి పెద్ద మొత్తంలో వనరులు వినియోగించబడ్డాయో, అలాగే

బౌద్ధ జన్మస్థానమైన భారతదేశంలో, కూడా సరయిన రీతిలో బౌద్ధధర్మ పునర్వికాసం కోసం నిబద్ధత గల ప్రయత్నాలు విధిగా జరిగి తీరాలి. భారతదేశంలో బౌద్ధ పునరుద్ధరణకు ఇదే సరయిన సమయం. ఈ మహత్కార్యం కోసం ఎవరు సహకరించినా, లేకపోయినా నేను నా ప్రయత్నాన్నీ, కృషినీ కొనసాగించడానికి సిద్ధంగా ఉన్నాను.

✳ ✳ ✳ ✳ ✳

- *Dr. B.R. Ambedkar, Baudh Dharam hi Manav Dharam (Hindi), edited by Bhikshu dharmarakshita, saranath, Varanasi, 1967. Translation : D.c. Ahir.*

# 3. ఎందుకు బౌద్ధానికి ప్రాముఖ్యత నివ్వాలి?

*మే 12, 1956 లండన్ బిబిసిలో మాట్లాడుతూ డా॥ అంబేద్కర్ ఈ అంశాన్ని ప్రస్తావించారు.*

నాకు నిర్దేశించిన ఈ కొద్ది సమయంలో రెండు ప్రశ్నలు నన్ను అడిగారు: మొదటిది, 'బౌద్ధం అంటే నాకెందుకు ఇష్టం', ఇక రెండోది 'ప్రస్తుత పరిస్థితులలో బౌద్ధం వల్ల ప్రపంచానికెలా ప్రయోజనం'.

ఇతరేతర మతాలు ఎందులోనూ లభించని మూడు సూత్రాల్ని బౌద్ధం ప్రతిపాదించింది కాన నేను బౌద్ధాన్ని ఇష్టపడతాను. అన్ని మతాలు దేవుడూ, ఆత్మ, మరణానంతర జీవితం గురించి వాటిల్లో అవి మల్లగుల్లాలు పడతాయి. బౌద్ధం ప్రజ్ఞ (మూఢ విశ్వాసాలకి, మానవాతీత శక్తులకి విరుద్ధమైన అవగాహన), కరుణ (ప్రేమ), సమత (సమానత్వం)లని బోధిస్తుంది. భూమ్మీద మనిషి సహజంగా, సంతోషంగా జీవించడానికి కావాల్సినవివే. బౌద్ధంలోని ఈ మూడు సూత్రాలు నన్ను ఆలోచింపజేసాయి. బౌద్ధంలోని ఈ మూడు సూత్రాలే ప్రపంచాన్ని కూడా ఆలోచింపజేస్తాయి. అంతేకానీ ఆత్మ, పరామాత్మలేవీ సమాజాన్ని కాపాడలేవు.

ప్రపంచానికి, ముఖ్యంగా ఆగ్నేయాసియా విభాగానికి వర్తించే మరో విషయాన్ని ప్రస్తావించాలి. కమ్యూనిజం, దాని పితామహుడిగా చెప్పబడే కార్ల్‌మార్క్స్ ప్రభావం వల్ల ప్రపంచం తీవ్ర తాకిడికి గురైంది. ఈ సవాలు చాలా తీవ్రమైంది. మార్క్సిజం – కమ్యూనిజం లౌకికమయిన ప్రాపంచిక వ్యవహారాలకి సంబంధించినవి. అన్ని దేశాలలోని మతవ్యవస్థ పునాదుల్ని ఇవి తీవ్రంగా కుదిపేసాయి. లౌకిక వ్యవస్థకి, మత వ్యవస్థకి నేడు సంబంధం లేకపోయినప్పటికీ, లౌకికతకి గల వ్యవస్థీకృత పునాదుల్లో సుదూరమైనాసరే మతానికి ప్రమేయం ఉంటుంది.

ఆగ్నేయాసియా లోని బౌద్ధ దేశాలు కమ్యూనిజం వైపు మరలడం నన్ను చాలా ఆశ్చర్యపర్చింది. అంటే, దాని అర్థం వాళ్ళు బౌద్ధాన్ని అసలు అర్థం చేసుకోలేదన్నమాట. బౌద్ధం అంటే ఏంటో వాళ్ళకి అవగతం కాలేదన్నమాట. మార్క్సుకి, ఆయన కమ్యూనిజానికీ బౌద్ధం సంపూర్ణ సమాధానమని నేను వాదించదలిచాను. రష్యా తరహా కమ్యూనిజం రక్తపాతంతోనే నెలకొల్పబడుతుంది.

హింస ద్వారానే తన లక్ష్యాన్ని సాధిస్తుంది. కానీ, బౌద్ధ సామ్యవాదం లేదా బౌద్ధ కమ్యూనిజం రక్తపాత రహితమయిన మానసిక విప్లవం. కమ్యూనిజాన్ని ఆశ్రయించాలని అనుకునేవారు గ్రహించవలసిన విషయం ఏమిటంటే 'సంఘం' అనేది కమ్యూనిస్టు వ్యవస్థ. ఇందులో వ్యక్తిగత ఆస్తికి తావులేదు. హింసను అవలంభించడం ద్వారా దీనిని నిర్మించలేం, మనసులు మార్చడం వల్లనే ఇది సాధ్యపడుతుంది. 2500 సంవత్సరాలుగా అందుకే నిల్చిందిది. నిర్మాణపరంగా క్షీణించవచ్చు కానీ ఆదర్శాలింకా అంతే శక్తివంతంగా ఉన్నాయి. రష్యన్ కమ్యూనిజం దీనికి జవాబు చెప్పాలి. మరో రెండు ప్రశ్నలకి కూడా వాళ్ళు సమాధానాలు చెప్పాలి. మొదటిది కమ్యూనిస్టు సమాజం అనేది సర్వకాల సర్వావస్థలకి ఎందుకు అవసరం. వాళ్ళ విధానాల్ని రష్యన్ ప్రజలు ఒప్పుకొనుండొచ్చు కానీ ప్రజలకి బుద్ధుడు బోధించిన ప్రేమ, సమతా భావనల్ని అనుసరించే స్వేచ్ఛ ఎందుకు ఉండకూడదు? ఆగ్నేయాసియా దేశాలు రష్యా వలలో పడకుండా అప్రమత్తంగా వుండటం అవసరం. పడితే అందులో నుండి బయటపడటం కష్టం. ఇప్పుడు వారికి కావాల్సింది బుద్ధుడి బోధనలు, బౌద్ధ అధ్యయనం, ఇంకా బుద్ధుని బోధనలకి రాజకీయ రూపాన్ని ఇవ్వడం. పేదరికం ఇప్పుడున్నది. అలాగే ఎప్పుడూ ఉంటుంది. రష్యాలో సైతం పేదరికం ఉన్నది, కానీ పేదరికం పేరుతో మనిషి స్వేచ్ఛను కాలరాయకూడదు, బీదరికం మాటున మానవుడి స్వతంత్రాన్ని బలిచేయరాదు.

దురదృష్టవశాత్తూ బుద్ధుని బోధనలు సరయిన విధంగా వ్యాఖ్యానించబడలేదు, ఇంకా అర్థం చేసుకోబడలేదు. సంఘ సంస్కరణాభిలాషతో కూడిన అనేక బౌద్ధ సిద్ధాంతాలు, ప్రజాహిత బుద్ధ ప్రవచనాలు అసలు సంపూర్ణంగా అర్థమే చేసుకోబడలేదు. ప్రపంచ పురోగామి మార్గంగా మానవాళి బౌద్ధాన్ని అర్థం చేసుకుని అంగీకరించిన రోజున, శాశ్వతమయిన సువార్త తన పునర్వికాసం ద్వారా అందించే సిద్ధాంతం గొప్పతనాన్ని స్వయంగా తెలుసుకున్నవారౌతారు.



# 4. విమోచనకి విస్పష్టమయిన మార్గం: బౌద్ధం

*అక్టోబర్ 14, 1956 డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ 5 లక్షల మంది తన అనుచరులతో బౌద్ధాన్ని స్వీకరించారు. నాగపూర్ కేంద్రంగా జరిగిన ఒక చారిత్రక సంఘటన అది. మరుసటిరోజు అంటే, అక్టోబర్ 15, 1956 న మూడు గంటలపాటు సుదీర్ఘంగా ప్రసంగించిన బాబాసాహెబ్ యుగయుగాలుగా వేదనలని అనుభవిస్తున్న అణగారిన ప్రజల చరిత్రపై వెలుగు సారించారు. అవమానాలు, అసమానతలకి వ్యతిరేకంగా చేసిన జీవితకాల పోరాటంతో బాటూ, ఎందుకు బౌద్ధాన్ని స్వీకరించారో స్పష్టం చేసారు.*

*బౌద్ధ సోదర సోదరీమణులారా,*

మహాత్మ బుద్ధుని ప్రవచనాలు ఇంకా బౌద్ధ ధర్మాన్ని పునరుద్ధరించి ప్రచారం చేయాలనే బృహత్తర కార్యక్రమాన్ని నేను ఎందుకు బాధ్యతగా తలపై పెట్టుకున్నాననే ముఖ్యమైన ప్రశ్నకి సంబంధించి నా ఆలోచనల్ని పంచుకోవాలని అనుకుంటున్నాను. ధమ్మదీక్ష స్వీకరణా కార్యక్రమం నిన్న పూర్తయిన విషయం మీకందరికీ తెలుసు. పెద్ద ఎత్తున భారీగా జరిగిన ఆ ధమ్మదీక్ష స్వీకరణా మహోత్సవాన్ని గురించి అంచనా వేయడం కష్టమైన విషయం. కొద్దిమంది మిత్రులు ఈ నా ప్రసంగం దీక్ష తర్వాత కాకుండా దీక్షాదినం రోజునే ఉంటే బావుంటుందని సూచించారు. అనేక చిక్కుముడులతో కూడిన అనివార్యమైన కారణాల వల్ల సరైన వరుస క్రమాన్ని పాటించడం ఎల్లప్పుడూ వీలవదు. తర్క నియమాల్లాగే చారిత్రక శక్తులు కూడా కొద్దిమంది అనుకుంటున్నట్లుగా ఈ అపసవ్యతకి కారణమని చెప్పాలి.

ఇప్పుడు అనేకమంది మనసుల్లో మెదులుతున్న మొదటి ప్రశ్న ఏమిటంటే, దీక్షాస్థలిగా నాగపూర్‌ని ఎందుకెంచుకున్నానని? ఇది ఆర్.ఎస్.ఎస్. కార్యకలాపాలకి కేంద్రస్థానం కనుక కావాలనే ఈ ప్రదేశాన్ని ఎంచుకున్నానని అనుకునేవారు ఉన్నారు. ఆర్.ఎస్.ఎస్. వారి ఎదుటనే బ్రహ్మాండమయిన బలప్రదర్శన చేయదలచి నేను ఈ ప్రాంతాన్ని ఎన్నుకున్నాననడం సరికాదు. అందులో నిజం లేదు, అలాంటి ఉద్దేశమేమీ నాకు లేదు. ఎవరినైనా గిల్లీగిచ్చీ, చికాకుపెట్టి రెచ్చగొట్టాలనే కోరికేదీ నాకు లేదు. అసలా తరహా పిల్ల చేష్టలకు నా దగ్గర సమయం లేదు.

ఇంకొంతమంది అనుకునేదేమంటే, సరిగ్గా ఇదే రోజున ఇదే సమయంలో నాగపూర్‌లో రాష్ట్రీయ స్వయం సంఘ్ ర్యాలీ జరుగనున్నది. కనుక దానికి పోటీగా నేనీ కార్యక్రమాన్ని తలపెట్టాననీ. అది కూడా నిజం కాదు. అలాంటి పద్ధతిలో ఆర్.ఎస్.ఎస్.తో మనం ఎందుకు పోట్లాడాలి? అందుకు మనకంత సమయమూ లేదు, అంతటి గౌరవాన్ని పొందేందుకు ఆ సంస్థకి అర్హతా లేదు.

నా భుజస్కంధాలపై పెట్టుకున్న మహత్తర కార్యం ఎంత గొప్పదంటే అందుకోసం ప్రతీ క్షణమూ నాకత్యంత విలువైందే. ఈ చారిత్రక ఘట్టానికి గాను ఈ స్థలాన్ని ఎంచుకున్నప్పుడు నా మనసులో ఇసుమంత కూడా ఆర్.ఎస్.ఎస్. గురించిన ఆలోచన ఏ కోశానా లేదు. ఈ మహత్తరమైనటువంటి సత్కార్యం కోసం నాగపూర్ నగరం ఎంచుకోవడానికి పూర్తిగా భిన్నమయిన కారణం ఉంది.

ఆరంభంలో బౌద్ధ మతాన్ని విస్తృతంగా ప్రచారం చేసిన వాళ్ళు 'నాగులు'. భారతదేశంలో బౌద్ధ చరిత్రని అధ్యయనం చేసినవారికి ఈ విషయం తెల్సినదే. నాగులు అనార్యులు. నాగులకీ – ఆర్యులకీ మధ్య భయంకరమైన శత్రుత్వం ఉండేది.

ఆర్యులకి, అనార్యులకి నడుమ ఎన్నో పోరాటాలు, యుద్ధాలు జరిగాయి. ఆర్యులు నాగుల్ని పూర్తిగా నిర్మూలించాలనుకున్నారు. ఈ అంశంపై ఎన్నో గాథలు పురాణాలలో కనిపిస్తాయి. అఘస్త్య ముని ఒక నాగుని రక్షించాడు. బహుశ మనందరం ఆ నాగు యొక్క వారసులమే.

ఆర్యులు నాగులపై ఎన్నో అఘాయిత్యాలు చేసారు, అనేక పీడనలకి గురిచేసి అణిచివేసారు. వార్ని విముక్తి చేయడానికి ఒక మహాపురుషుడు బుద్ధుడి రూపంలో వచ్చినట్లు వాళ్ళు గమనించారు. బుద్ధ భగవానుడు వాళ్ళు నాశనం కాకుండా కాపాడాడు. అలా బౌద్ధులుగా మారిన నాగులే లోకమంతా బౌద్ధాన్ని వ్యాపింపజేసారు. వీళ్ళు ప్రధానంగా నాగపూర్ నివాసులు. ఈ నగరం గుండా 'నాగ్' అనే పేరుగల నది ప్రవహించేది. ఆ నదీ పరీవాహక ప్రాంతంలోనే నాగులు నివసించినట్లు తెలుస్తోంది. మహత్తరమయిన ఈ చారిత్రక కార్యక్రమానికి నాగపూర్‌ని ఎన్నుకోడానికి గల ముఖ్యమైన కారణం ఇదే. మరే ఇతర కారణమూ లేదు. ధమ్మదీక్షా కార్యక్రమానికి గానూ ఈ నగరాన్ని ఎన్నుకోవడం పట్ల ఇతరేతర అపార్థాలకి, అనవసరమయిన ప్రచారాలకి ఇక ఎంతమాత్రమూ తావుండరాదు.

ఈ మార్గాన్ని ఎన్నుకోవడం వలన నేను చాలా తీవ్రమయిన విమర్శలకి గురయ్యాను. అందులో కొన్ని మరింత క్రూరమైనవి కూడా ఉన్నాయి. పేదరికంలో మగ్గిపోతున్న అణగారిన జనాల్ని నేను తప్పుదోవ పట్టించపూనుకున్నట్లు కొందరు ఆరోపించారు. ఆ ప్రకారం ఈ పీడిత ప్రజలు అనుభవిస్తున్న కొద్దిపాటి రాయితీలు, ప్రత్యేక అవకాశాలను నా మార్గాన్ని అవలంభించడం వల్ల కోల్పోతారు. మరికొంతమంది నొక్కి చెప్పేదేమంటే నిమ్న వర్గాల విముక్తి కోసం నేనెన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ, అంతిమంగా అంటరానివారు ఎప్పటికీ అంటరానివారుగానే ఉంటారు. మన అభివృద్ధి కోసం ఇప్పటివరకూ అనుసరించిన మార్గాన్ని ఒక్కసారిగా వదిలిపోవడం తెలివైన పని కాదేమోనని అనేక మంది అభిప్రాయం వెలిబుచ్చారు. నిమ్న వర్గాలకి చెందిన పెద్దలు ముఖ్యంగా, యువత మనసుల్లో అనవసరపు భయాల్ని, అనుమానాల్నీ కలిగించడమే ఈ రకమయిన తుంటరి మాటల లక్ష్యం. కాబట్టి, ఈ ప్రశ్నకి నేను జవాబు చెప్పితీరాలి. ఈ రకమయిన అనుమానాల్నీ, భయాల్ని తొలగించడం వల్ల మన ఉద్యమం మరింత బలోపేతం అవుతుంది. ఈ ప్రశ్నకి సంబంధించీ నేను అనేక విషయాలు చెప్పదల్చుకున్నాను. ఆర్థికంగా బలహీనపడి వెనకబడిపోతామనేవాళ్లు బాధపడేది పాకీ పని, కళేబరాల్ని తీసేపని, చర్మాల్ని ఒలిచి శుద్ధి చేసేటటువంటి నీచమైన వృత్తుల గురించి కావచ్చు.

వాళ్ళ అభ్యంతరం చనిపోయిన జంతు కళేబరాన్ని ఎత్తివేయడం గురించినది. మాలలు, మాదిగలు ఆవుగేదెల కళేబరాల్ని ఎత్తరాదు. చచ్చిన గొడ్ల మాంసాన్ని మాలలు, మాదిగలు తినరాదనే నినాదాన్ని కూడా నేను ఇచ్చాను. 30 ఏళ్ళ క్రితమే ఈ ఉద్యమాన్ని నేను ప్రారంభించాను. ఈ విషయం ఎలాగో మన హిందూ మిత్రులకి కోపం తెప్పించింది. నేను వాళ్ళ నడిగాను, 'ఆవుల్నుంచీ, గేదెల నుంచీ మీరు పాలు తీసుకుంటారుగా, మరి అవి చనిపోయాక వాటి కళేబరాల్ని ఎత్తి తీసుకునిపోయే పని మాత్రం మాదని ఎందుకు భావిస్తారు? మరణించిన మీ తల్లుల మృతదేహాలు మీరెత్తగా లేనిది గోమాతల కళేబరాల్ని మాత్రం మీకు మీరే ఎందుకు తీసేసుకోలేరు?

ఈ నా ప్రశ్నకు హిందువులు చిరాకు పడ్డారు. అప్పుడు నేను వారితో అన్నాను: 'మీరు కనక మీ తల్లుల మృతదేహాల్ని మాతో తీయించగలిగితే, అప్పుడు మేం చచ్చిన మీ గొడ్లు, గోవుల కళేబరాల్ని కూడా తీయడానికి సంతోషంగా ముందుకు వస్తాం' అని. అంతే, బ్రాహ్మణులు, హైందవ ప్రతినిధుల నుండి వచ్చిన అనేక ఉత్తరాలు

'కేసరి'లో ప్రచురించబడ్డాయి. ఒక కొంకణ బ్రాహ్మణుడైతే ఏకంగా, అంటరానివారు కనుక చచ్చిన గొడ్లను జంతు కళేబరాలను తీయటం మానివేస్తే వాళ్ళు తీవ్రమైన ఆర్థిక నష్టాలకి గురౌతారని రాయడమే కాక, తన వాదనకి బలం చేకూర్చుకోవడం కోసం గణాంక వివరాలు సైతం ఇచ్చాడు. అతని వాదన ప్రకారం జంతు కళేబరాలు తీసే మాదిగవారు గొడ్ల చర్మం, కొమ్ములు, పళ్ళు, గిట్టలు, ఎముకల అమ్మకం వల్ల సంవత్సరానికి ఐదారొందల వరకూ సంపాయిస్తారు. ఆ జీవనాధారానికి విరుద్ధమైన ప్రచారం ద్వారా పేదల కడుపు నేను కొడుతున్నానని బ్రాహ్మణుడి వాదన. దాంతో నేనెక్కడికి తీసికెళ్తానో అనే గందరగోళంలో నా ప్రజలు పడ్డారు. ఒకసారి బెల్గాం జిల్లాలోని సంగమనేర్ మండలానికి వెళ్ళాను. కేసరి పత్రికలో ఈ లేఖ రాసిన బ్రాహ్మణుడు నన్నక్కడ కలిసి తన ప్రశ్నని మళ్ళీ నా ముందుంచాడు. అప్పుడు నేను కొంతసమయం తర్వాత ఆయన ప్రశ్నకి సమాధానం చెబుతానని చెప్పాను. తర్వాత బహిరంగ సమావేశంలో నేనా జవాబు ఈ విధంగా చెప్పాను;

'నా ప్రజలకి చాలినంత తిండి లేదు. స్త్రీలకి వాళ్ళ శరీరాల్ని కప్పుకోడానికి కావాల్సిన బట్టలు లేవు. వాళ్ళు తలదాచుకునేందుకు సరైన నివాసాలు లేవు. పండించుకునేందుకు పంట భూమి లేదు. కాబట్టి వాళ్ళు పేదరికపు పీడితులు, బీదరికపు బాధితులు. వాళ్ళు అణచబడ్డవాళ్ళు, దోపిడీకి గురయినవాళ్ళు. కారణం ఏంటో మీలో ఎవరికైనా తెలుసా?

సమూహం నుండి సమాధానం ఏదీ రాలేదు. 'కేసరి'కి లేఖ రాసిన వ్యక్తి కూడా ఏమీ స్పందించలేదు. అప్పుడు నేను మొదలుపెట్టాను, మీరు మా మానాన మమ్మల్ని వదిలివేయడం మంచిది. పెద్ద మనుషులారా, మా గురించి మేం ఆలోచించుకోగలం. మా మంచి చెడ్డలకి సంబంధించిన నిర్ణయాలు మేం తీసుకోగలం. జంతు కళేబరాలు ఎత్తకపోవడం వల్ల మాకు వచ్చే నష్టం పట్ల మీకంత చింతగా ఉంటే, మీరే మీ బంధుమిత్రుల్ని గ్రామాలకి పంపి చచ్చిన గొడ్లను లాక్కెళ్ళే మురికి పనిచేసి ఏడాదిలో ఆ ఐదొందలేవో వారినే తీసుకోమని చెప్పకూడదూ? అదనంగా నా జేబులో నుండి మరో అయిదొందల రూపాయలు కూడా నేను ఇస్తాను. వారు రెట్టింపు సంపాదించుకోవచ్చు. ఈ అవకాశాన్ని ఎందుకు జారవిడుచుకోవడం. నిజమే, మేం నష్టపోతాం, కానీ మీరు లాభపడతారు.'

దురదృష్టవశాత్తూ నేను ప్రకటించిన ఆ పురస్కారాన్ని పొందడానికి ఇప్పటిదాకా ఎవరూ ముందుకు రాలేదు. ఈ భూమ్మీద మేం బాగుపడడం వారినెందుకు అంతలా కలవరపెడుతుంది. నా ప్రజలకి సంబంధించినంతవరకూ వారి తిండి, గుడ్డ, గూడు, ఇతర అవసరాల సంగతి నేను చూసుకుంటాను. మీరు (హిందువులు) ఇందుకోసం విచారించవలసిన పనిలేదు. చచ్చిన గొడ్లని తీసే పని మాత్రం మాకు లాభదాయక మయితే, మీకు మాత్రం నష్టదాయకమా? ఏం వింతైన తర్కం? కాదా??

మరికొంతమంది ఏమంటున్నారంటే, చట్టసభల్లో మాకోసం కేటాయించబడిన స్థానాల్ని ఎందుకు వదులుకుంటున్నారనీ. నేను వారికి చెప్పేదేమంటే మీ కోసం మేము ఆ సీట్లని సంతోషంగా ఖాళీ చేసి యిస్తాం; బ్రాహ్మణులు, రాజులు, ఇంకా అగ్రకులాల హిందూలంతా ముందుకొచ్చి మాలలు, మాదిగలు, చర్మకారులు, పారిశుధ్య కార్మికులుగా మారిపోయి ఈ అవకాశాన్ని అందుకోండి. అంతేకానీ మాకు జరిగే నష్టం గురించి ఊరకే మీరెందుకు గుండెలు బాదుకుంటూ గొంతులు చించుకుని గగ్గోలు పెడుతున్నారు?

ఐహికమయిన ప్రయోజనాల కంటే ఆత్మగౌరవం ముఖ్యమయింది. మా పోరాటం మర్యాద, ఆత్మగౌరవం కోసమే కానీ కేవలం ఆర్థికాభివృద్ధి కోసం కాదు.

బొంబాయిలో ఒకచోట వేశ్యలు, వ్యభిచారిణులు ఉంటారు. తమ రక్తమాంసాలతో వ్యాపారం చేసే వీరు ఉదయం 8 గంటలకి అక్కడున్న చౌక హోటళ్ళలో పనిచేసే ముస్లిం కుర్రాళ్ళని కేకలేసి పిలుస్తూ 'వో సులేమాన్ మాకు కీమా ఇంకా రొట్టెలు తీసుకురా' అని అరుస్తుంటారు.

కీమా రొట్టెలు, టీ రోజూ వాళ్ళు తీసుకుంటారు. కానీ, మన స్త్రీలు ఎన్నడూ కీమా రొట్టెలు తినలేరు. ఇక్కడికి వచ్చిన వాళ్ళలో ఎక్కువమందికి ప్రతిరోజూ కడుపుకింత దొరకడం కూడా కష్టమే. నా ప్రజలంతా పచ్చడి మెతుకులతోనే జీవిస్తున్నారు. కావాలనుకుంటే అలాంటి పాడు పనులు చేస్తూ పాపంతో వీరు కూడా సుఖంగా జీవించగలరు, కానీ వాటికంటే మర్యాద, మన్నన, ఆత్మగౌరవం ముక్యమని వీళ్ళు భావించారు. మేం సరిగ్గా వీటికోసమే పోరాడుతున్నాం, అవే మర్యాద, ఆత్మగౌరవం.

గౌరవనీయమయిన జీవితాన్ని పొందడం మనిషి జన్మహక్కు. అందుకోసం మేం చిట్టచివరిదాక ప్రయత్నిస్తాం. ఆ లక్ష్యాన్ని సాధించడానికి ఎంతటి త్యాగం చేయడానికయినా మేం సిద్ధంగా ఉన్నాం. మనిషనేవాడికి అవసరమయిన, హిందువులు ఇప్పటిదాక మాకు ఇవ్వడానికి నిరాకరించిన ఆత్మగౌరవం కోసమే మేం పోరాడుతున్నాం. మేం మా జీవితాన్ని వీలైనంత విశాలంగా, సంపూర్ణంగా, ఆరోగ్యకరంగా జీవించాలని అనుకుంటున్నాం.

బౌద్ధాన్ని స్వీకరించడం వల్ల మనం చాలావాటిని త్యాగం చేయవలసి రావొచ్చు. ఇప్పటి దాకా ఉన్న రాయితీలు, రిజర్వేషన్లు ఇంకా ఎన్నో; ఐతే అవేవీ మీరు కోల్పోరనే భరోసా నేనిస్తున్నాను. ఈ కార్యక్రమం అనంతరం నేను దృష్టి పెట్టబోయేది వాటిని గురించేనని స్పష్టం చేస్తున్నాను.

ఈ రాయితీలని కొనసాగించమనడం అంటే, మన కార్యాచరణ కోసం కోర్టుని ఆశ్రయించవలసి రావచ్చు. ఆ నిర్ణయం ఏదైనా నేను ఇప్పుడిక్కడ చెప్పదల్చుకోలేదు కానీ, ఎలాంటి పరిస్థితులనయినా ఎదర్కోడానికి సిద్ధంగా ఉన్నానని మాత్రం చెప్పగలను. హక్కులు సాధించేంత సామర్థ్యం ఉన్నవారికి వాటిని నిలుపుకునేంత శక్తి కూడా ఉంటుంది. ఈ ఉద్యమాన్ని అభివృద్ధి చేయడం కోసం అనేక సాహసోపేత నిర్ణయాలు మనం తీసుకోవాల్సి ఉంటుంది. బౌద్ధులుగా మారడం వల్ల అనేక సమస్యలు తెరపైకొస్తాయి. మనం అలాంటి గడ్డు పరిస్థితుల్ని ఎలా ఎదుర్కొన బోతున్నాం? ఆ కష్టాలకి ధైర్యంగా ఎలా ఎదురెళ్ళబోతున్నాం? ఇలాంటి సమస్యలని పరిష్కరించడానికి తగిన బలము, బలగమూ నా దగ్గర ఉన్నాయి. నేను హక్కులకోసం పోరాడటం మాత్రమే కాదు, వాటిని మీ కోసం సంరక్షిస్తాను కూడా. మీ కోసం తిరిగి వాటిని సాధించి పెడతానని మీకు హామీ ఇస్తున్నాను. ఐతే, నేను మరణించాక ఏం జరుగుతుందో మట్టుకు నేను చెప్పలేను.

నా మీద, నా మాటల మీద నమ్మకం ఉంచండి. మన ప్రత్యర్థులు ప్రచారం చేసే వాటిలో అసలేమాత్రం నిజాలు లేవు. నేను మిమ్మల్ని కోరేదేమంటే మీరు ఆ మాటల్నేమాత్రం లక్ష్యపెట్టకండి.

ధమ్మ స్వీకారానికి సంబంధించిన ప్రశ్నలు ప్రతీచోటా చర్చించబడుతున్నాయి కానీ ఇన్ని మతాలుండగా బౌద్ధాన్నే నేను ఎందుకు ఎంచుకున్నానని ఎవరూ

అడగలేదు. ఏ మత స్వీకారానికయినా వర్తించే ముఖ్యమైన ప్రశ్న ఇది. ఏదయినా మతం స్వీకరించేటప్పుడు వ్యక్తి రెండు ప్రశ్నల్ని తనకుతాను వేసుకోవాలి;

1) ఏ మతాన్ని స్వీకరించాలి?

2) ఎలా స్వీకరించాలి?

1935లో నాసిక్‌లో నేను హిందూ మతాన్ని త్యజించబోతున్నానని ప్రకటించిన నాటి నుంచీ నేనీ విషయంపై మధనపడుతూనే ఉన్నాను. 1935లో యోలాలో జరిగిన సమావేశంలో తీర్మానించుకుని నిర్ణయించుకున్నదేమంటే, మనం హిందూమతాన్ని విడనాడాలని. పుట్టుకనేది నా చేతుల్లో లేనందున నేను హిందూగా పుట్టాను కానీ హిందువుగా మాత్రం చనిపోనని నేనా సమావేశంలో ప్రకటించాను. ఈ ధమ్మదీక్షా మహోత్సవం నాకు అపారమయిన సంతృప్తినిచ్చింది, ఆ ఆనందానికి అంతులేదు. నరక కూపం నుండి బయటపడ్డాననే భావన కలుగుతోంది. నిన్న దీక్ష తీసుకున్న వారందరూ ఈ అనుభూతి పొందారనే అనుకుంటున్నాను. కానీ, గుడ్డిగా నన్ను అనుసరించేవారు నాకు అవసరం లేదు. గొర్రె మనస్తత్వం నాకు నచ్చదు. ఎవరైతే బుద్ధ సన్నిధిలోకి రావాలనుకుంటున్నారో, వారు ముందే మంచి చెడులన్నీ ఆలోచించుకుంటే మంచిది. బౌద్ధాన్ని ఆచరించడం చాలా కష్టమయిన పని.

మానవాళి వికాసానికి మతం ఇంకా సరిగ్గా చెప్పాలంటే ధర్మం కచ్చితంగా అవసరం. కార్ల్‌మార్క్స్ అభిమానులు మతం మత్తుమందంటారు. కానీ మార్క్స్ మాటల్ని మనం కృతకంగా తీసుకోకూడదు. విమర్శనా దృష్టితో చూడాలి. మాకు మతంతో పనిలేదు. మతం నిరర్ధకమైనదని వాదించే వారిలో కూడా ఎక్కువమంది 'తిను, తాగు, ఆనందంగా గడుపు' అనే రీతులనే అనుసరిస్తూ ఉంటారు. వాళ్ళకి కావాల్సిందల్లా ఉదయం అల్పాహారానికి వెన్నపూసిన రొట్టెలు, మధ్యాహ్నం మాంఛి రుచికరమయిన భోజనం, విశ్రాంతికిగానూ సుప్తైన సుఖాసీన మంచం పరుపు, ఇంకా సమయం వెచ్చించడానికి సినిమాలు వగైరా. వాళ్ళ జీవితంలో మరి మతానికిక స్థానం లేదు. ఐతే, నేను వాళ్ళ వాదనలతో ఏకీభవించలేను. మా నాన్నగారి పేదరికం మూలాన ఈ విలాసాలేవీ పొందే అవకాశం నాకు లేదు. జీవితంలోని ఇంత కాలంలోనూ నేనింకా అధికంగా కష్టపడి పనిచేయవలసి వచ్చింది. కానీ ఇదంతా నన్ను మత రహితుడ్ని చేయలేదు.

పేదలు పడే కష్టాలెలాంటివో స్వయంగా నాకు తెలుసు. మనం వాటిని దృష్టిలో ఉంచుకుని ఆర్థికపరమయిన అంశాలకి అనుగుణంగానే పోరాటాన్ని ప్రారంభించాలి. అటువంటి ఆలోచనలకి నేను వ్యతిరేకం కాదు. మనం ఆర్థికంగా వృద్ధి చెంది స్వతంత్రంగా నిలబడడానికి ప్రయత్నించి తీరాలి. నా జీవితాంతం అందుకోసమే నేను పోరాటం చేసాను. ఇది మాత్రమే కాదు, మనిషనేవాడు ఆర్థికంగా బలోపేతం అవ్వాలనేది నా ఆకాంక్ష కూడా. కానీ, ఈ విషయంలో నాకంటూ కొన్ని స్వతంత్ర భావాలున్నాయి.

మనిషికీ పశువులకీ వ్యత్యాసం ఉంది. పశువులకి రోజువారీ ఆహారం మినహా మరేమీ అవసరం లేదు. మనిషి తన దేహంతో పాటు మనసుని కూడా వికసింపజేసుకోవాలి. శరీరంతో సమానంగా మేథస్సు కూడా అభివృద్ధవ్వాలి. మనసెప్పుడూ స్వచ్ఛమయిన ఆలోచనల్ని ప్రతిబింబించాలి. 'తిని, తాగి, ఉల్లాసంగా గడపడమే జీవిత లక్ష్యంగా ఉన్న జనులున్న దేశాల్లో ఎటువంటి ప్రయోజనమూ ఉన్నట్లు వ్యక్తిగతంగా నేనైతే నమ్మడం లేదు. మనం ఎల్లప్పుడూ గుర్తుంచు కోవలసినదేంటంటే, రోగాలకి దూరంగా దేహాన్ని ఆరోగ్యకరంగా ఎలా ఉంచుకుంటామో, అర్థవంతమయిన అన్వేషణా జ్ఞానంతో మనసుని కూడా అంతే ఆరోగ్యకరంగా ఉంచుకోని యెడల మనిషి ఎంత అభివృద్ధి చెందినప్పటికీ అదంతా నిరర్ధకమే.

మనిషి మనసు ఎందుకు జబ్బు పడుతుంది? మానవ దేహం దుఃఖం నుండి బయటపడకపోవడమే దీనికి కారణం, అప్పటిదాకా మనసుకి ప్రశాంతత లభించదు. మహారాష్ట్రకి చెందిన సన్యాసి రామ్‌దాస్ మనిషికి ఉత్సాహం లేకపోతే గనుక అతడి శరీరం లేదా మనసూ ఏదోకటి రోగగ్రస్తం అవుతాయని చెప్పేవారు. మరైతే మనిషిలో నిరాశకి, నిరుత్సాహానికి ఏమిటి కారణం? ఆశలేని జీవితాన్ని గడపడం ఒట్టి చాకిరీలా అనిపిస్తుంది. నిరుత్సాహం బతుకుని భారం చేస్తుంది. ఐతే, ఎవరైనా ఉత్సాహం ఎందుకు కోల్పోతారు? ఈ నిరుత్సాహానికి ప్రధాన కారణం తనని తాను ఉన్నతీకరించుకునే అవకాశం పట్ల వ్యక్తి విశ్వాసాన్ని కోల్పోవడం. ఆత్మ విశ్వాసం లేకపోవడమే నిరాశ, నిరుత్సాహానికి దారితీస్తాయి. ఇలాంటి పరిస్థితులలోనే మనసు రోగగ్రస్తమౌతుంది.

ఆత్మ విశ్వాసపు వెలుగురేఖలు ప్రసరించని అధ్వాన్నమయిన బతుకులెప్పుడూ భారంగా, నిరుత్సాహంగానే నడుస్తుంటాయి. ఐతే, అసలు ఉత్సాహం అనేది ఎప్పుడు ఉత్పన్నమౌతుంది? ఒకరు పడ్డ కష్టానికి చేసిన కృషికీ న్యాయమయిన గుర్తింపూ, ప్రతిఫలం దక్కినప్పుడు, అలా పొందే వాతావరణాన్ని మనందరం నిర్మించుకోగలిగి స్వేచ్ఛాగాలులు పీల్చుకున్నప్పుడే ఎవరయినా ఉన్నతమయిన ఉత్సాహాన్ని, అస్తిత్వానికి సంబంధించిన ఆత్మ విశ్వాసపు స్ఫూర్తినీ పొందగల్గుతారు.

పాఠశాలల్లోని ఉపాధ్యాయులు కూడా 'ఇదిగో చూడండి వీడు మాలపిల్లాడు, వీడికి క్లాసుఫస్టెలా వస్తుంది? అంటూంటే ఆ పిల్లవాడెలా ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణు డౌతాడు? ఫస్టు మార్కులకీ, తరగతిలో ర్యాంకులకీ బ్రాహ్మణుల పిల్లలు మాత్రమే అర్హులు. మరప్పుడు ఈ పరిస్థితులలో మాలమాదిగ పిల్లలకి ఉత్సాహం, స్ఫూర్తీ, ఆత్మవిశ్వాసం ఎలా ఉంటాయి? మన పిల్లలు జీవితంలో ముందుకు సాగి ఎలా పురోగతిని సాధించగలరు?

జీవితంలో ఉత్సాహానికి – ప్రేరణకీ ఆరోగ్యకరమైన, మెరుగైన మనసనేదుండాలి. అలాంటి మనసున్న మనిషే ఎటువంటి కష్టాలనయినా అధిగమించగలడు. ఎలాంటి ఒడిదుడుకులనయినా ఎదర్కోగల ఉత్తేజమూ మనో ధైర్యమే, మనిషికి కావలసిన మహోన్నతమైన దృఢ సంకల్పస్ఫూర్తినీ, మానవీయమయిన ఉత్సాహాన్నీ అందిస్తాయ్.

దురదృష్టవశాత్తూ, అసమానతలు అన్యాయాల పునాదులపై స్థాపించబడిన హిందూ మతంలో ఈ విధమయిన ఉన్నతికీ – ఉత్సాహానికీ చోటు లేదు. అలాంటి హిందూమతం యొక్క కాడిని అంటరానివారు బానిసల్లా తలపై మోసినంతకాలమూ, ఆ దుర్మార్గమైన మతంలో వారి జీవితాభివృద్ధికి గానీ, ఆత్మ విశ్వాసానికీ గానీ, స్ఫూర్తివంతమైన ఆశాజనక ఉత్సాహానికి గానీ తావులేదు. కేవలం పొట్టనింపుకునే వందలాది గుమస్తాల్ని ఉత్పత్తి చేయడం మినహా వారు ఇంకేమి చేయలేరు. ఇంకేం చేస్తారు. అప్పుడు మనకి వారిపై జరిగే అత్యాచారాలు – అన్యాయాల నుండి రక్షించే పెద్ద గుమస్తాలు అవసరమౌతారు. సామాన్య అంటరాని అణగారిన ప్రజలకు ఒరిగేదేమి ఉండబోదు. షెడ్యూల్డ్ కులాలు హిందూమతం నుండి ఉత్సాహం, ప్రేరణల్ని ఎప్పటికీ పొందలేవు.

మనిషి తన మెదడు వికసించడానికి స్వేచ్ఛగా ఉన్నప్పుడే ఎక్కడి నుండైనా స్ఫూర్తి పొందగలడు. మీకు మిల్లు యజమానులు తెలుసు. వాళ్ళు మిల్లుల్లో కార్మికుల సారం మొత్తం పీల్చేయడానిగ్గాను మేనేజర్లని నియమించుకుంటారు. ఎందుకంటే పనిలో మునిగిపోయినప్పటికీ ఆ మిల్లు యజమానుల మెదళ్ళకి కాస్త ఆలోచించి వృద్ధయ్యేందుకు సమయం చిక్కుతుంది కనుక. ఐతే ఆస్తులు సంపాయించి వారు ఆర్థిక దిగ్గజాలుగా మారాక మానసిక మరుగుజ్జులవుతారు. మన మెదళ్ళు విద్య నార్జించడానికీ, వికసించడానికే మనం ఈ ఉద్యమాన్ని ప్రారంభించాం.

మీరు కనక అనుమతిస్తే నా చదువు ఎలా గడిచిందో ఆ అనుభవాన్ని మీతో పంచుకోవాలనుకుంటున్నాను. తీవ్రమయిన పేదరికాన్ని అనుభవిస్తూనే నేనో చింకిపాత గుడ్డ కప్పుకుని స్కూలుకి వెళ్ళేవాడిని. అది తప్ప నా ఒంటిపై యింకేమి ఉండేవి కాదు. స్కూల్లో త్రాగడానికి నాకు నీళ్ళు దొరికేవి కాదు. అలా దాహంతోనే చాలా రోజులు గడిపాను. ఇతరుల్ని గౌరవంగా పిలవాలని మా అమ్మ నాతో చెబుతుండేది. మా స్కూల్లో మరాఠా కులానికి చెందినామె ప్యూన్‌గా పనిచేస్తుండేది. చిరుగులు పడిన నా గుడ్డ సంచి కూడా ఆమెకి అంటరానిదే. నాకు కనక స్కూల్లో దాహం వేస్తే నాకు నేనుగా కుళాయి ముట్టుకోకూడదు. చివరికి బొంబాయిలోని ఎలిఫెంట్ స్టోన్ కళాశాలలో కూడా అంటరానితనం అమలవడాన్ని గ్రహించాను. ఈ పరిస్థితుల్లో ఎలాంటి వికాసాన్నయినా ఎలా ఆశించగలం?

కేవలం విద్య ద్వారా మాత్రమే అంటరానితనం తొలగిపోదు. బ్రిటీష్ ప్రభుత్వంలో నేను వైస్రాయి కార్యనిర్వాహక సభ్యుడిగా ఉండేవాడ్ని. ఆ సమయంలో విద్యాభివృద్ధి కోసం అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయానికీ, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయానికీ లార్డ్ లిన్‌టిన్‌గొ ఆధ్వర్యంలో చెరో 3 లక్షల రూపాయలు మంజూరు చేయబడ్డాయి. అప్పుడు నేనోసారి వైస్రాయితో మాట్లాడుతూ ఏమన్నానంటే హిందూ, ముస్లిం విశ్వవిద్యాలయాలకి మీరు చెరో మూడేసి లక్షల నిధుల్ని కేటాయించారు సరే కానీ అంటరానివారున్నారే వాళ్ళు హిందువులూ కాదు, ముస్లింలూ కాదు, కానీ ఈ ఇరు సమూహాలు కంటే నిజంగా బాగా వెనకబడి ఉన్నవాళ్ళు. కాబట్టి వాళ్ళ జనసంఖ్యని కూడా దృష్టిలో ఉంచుకుని వారి విద్య కోసం నిధులు కేటాయించమని కోరాను. లార్డ్ లినిట్‌గో ఈ అంశానికి సంబంధించిన వివరాలన్నింటినీ వివరిస్తూ లిఖితరూపేణా నివేదించవలసిందిగా నన్నడిగారు. నేనా మెమోరాండం సమర్పించాను.

యూరోపియన్లు సాధారణంగా సానుకూల దృక్పథం గలవారు. ఆయన నా ప్రతిపాదనకి అంగీకరించి షెడ్యూల్డ్ కులాలవారి విద్యకోసం 3 లక్షల రూపాయలు మంజూరు చేసారు. అప్పుడా డబ్బుని ఎలా సద్వినియోగం చేయాలనే ప్రశ్న వచ్చింది. షెడ్యూల్డు కులాల అమ్మాయిల చదువులకి ఆ నిర్దేశిత మొత్తం ఖర్చు పెట్టాలని వైస్రాయ్ అనుకున్నారు. వారికి వసతి గృహాలు నిర్మించాలనేది ఆయన ఆలోచన.

ఒకవేళ ఈ సొమ్ముని నిరక్షరాస్యులయిన షెడ్యూల్డ్ కులాల అమ్మాయిల వసతి గృహాలకోసం కనుక ఖర్చుపెట్టేస్తే, వారి ఆహారం కోసం త్వరలోనే మరింత డబ్బు అవసరమవుతుందని నేను భావించాను. నా ప్రజలెంత పేదవారంటే, వారు వాళ్ళమ్మాయిలకి ఇవన్నీ ఎలా సమకూర్చుకోగలరు?

ఆ వసతి గృహాల్లో ఉండే అమ్మాయల తిండి ఖర్చుల్ని మనమెలా భరించగలం? వంట వండడానికి మనమ్మాయిలకి ప్రత్యేక శిక్షణ అవసరం లేదు. ఐతే అసలీ చదువు ఫలితం ఏంటి, తర్వాత వాళ్ళ వివాహాలకి సంబంధించిన ప్రశ్నకి జవాబేదీ?

ఈలోగా షెడ్యూల్ కులాల విద్యాభివృద్ధి కోసం కేటాయించబడ్డ సొమ్ముని ప్రభుత్వం నిలిపేసింది, ఐతే ఇంకా ఎన్నో ఇతర అంశాలపై ఖర్చుచేసింది. నేను మరొకసారి వైస్రాయ్ వద్దకెళ్ళి ఆయనతో సూటిగా, స్పష్టంగా మాట్లాడాను. 'నేనో 500 మంది పట్టభద్రులకంటే మెరుగైనవాడ్ని కానా?' అనడిగాను. కచ్చితంగా మెరుగైనవారే అన్నారాయన. అప్పుడు నేను ఆయనతో 'నేను ఎందుకు అలా అడిగానో తెలుసా' అని ప్రశ్నించాను. ఆయన తెలీదన్నాడు. ఏ వ్యక్తయితే విదేశీ విశ్వవిద్యాలయపు పట్టా పొందుతాడో అతడు భారతదేశంలోని 50 విశ్వవిద్యాలయాల డిగ్రీ పట్టాలకి సమానమని వైస్రాయిని ఒప్పించడమే నా ఉద్దేశం. నాకున్న చదువువల్ల నేను ఏ ప్రభుత్వ శాఖలోనైనా ఆత్మవిశ్వాసంతో సమర్ధవంతంగా పనిచేయగలను అని ఆయనతో చెబుతూ, నాకు సరిగ్గా అలా ఎలాంటి మౌలిక బాధ్యతనయినా సమర్ధవంతంగా స్వీకరించి న్యాయంగా, జాతి ఉన్నతికోసం పనిచేసే విద్యావంతులు కావాలి. మీరు కనుక నిజంగా అంటరానివార్ని అభివృద్ధి చేయాలని అనుకుంటే, అలాంటి జాతి ఉద్ధారకుల్ని రూపొందించాలే కానీ గుమస్తాల్ని కాదన్నాను.

నా సలహాని సగౌరవంగా స్వీకరించిన వైశ్రాయ్ షెడ్యూల్ కులాలకి చెందిన 16 మంది విద్యార్థుల్ని ఉన్నత చదువులకోసం విదేశాలకి పంపించడం జరిగింది. ఈ 16 మందిలో కొద్దిమంది ఈ అవకాశాన్ని పూర్తిగా సద్వినియోగం చేసుకోగా, మిగిలిన వారు సగంలోనే వెనుదిరిగి ఇంటికొచ్చేసారు. దానికి కారణం ఏమిటంటే, బ్రాహ్మణులకి – ఇతర కులాలవారికీ హిందూమతంలో లభించే ప్రోత్సాహం, ఉత్సాహం షెడ్యూల్ కులాల వారికే మాత్రం లభించవు. వార్ని పురోగమింపజేసే వాతావరణమేదీ హిందూమతంలో లేదు.

నేనోసారి గాంధీజిని కలుసుకోడానికి వెళ్ళాను. గాంధీజీ తనకి చాతుర్వర్ణ వ్యవస్థలో నమ్మకముందని చెప్పారు. అప్పుడు నేను నా అరచెయ్యిని చూపుతూ కొన్ని విషయాలు అడిగాను, ఏ రకమైన చాతుర్వర్ణం గురించి మీరు చెబుతోంది? ఈ చిటికెన వేలుని కింద ఉంచి బొటనవేలుని ఎల్లప్పుడు పైన ఉంచే చాతుర్వర్ణమా? లేదా ఇలా సరిసమానంగా వేళ్ళన్నింటినీ పక్కపక్కనే ఉంచే చాతుర్వర్ణమా? అంటూ అరచేతిని బల్లమీద పెట్టి ప్రశ్నించాను. ఇంకా, అసలు మీ దృష్టిలో చాతుర్వర్ణం అంటే ఏమిటి? అది ఎక్కడ మొదలయ్యింది? ఎక్కడ ముగుస్తుంది? అని అడిగాను. గాంధీజీ సంతృప్తికరమయిన రీతిలో సమాధానం చెప్పలేదు.

మానవాభివృద్ధికి కావలసిన ప్రోత్సాహకరమయిన ఆనందకరమైన ఆశాజనక వాతావరణం లేకపోవడంతో పాటూ హిందూమతంలో సమానత్వం లేదు. క్షత్రియుడి కంటే బ్రాహ్మణుడు, వైశ్యుడు కంటే క్షత్రియుడు, శూద్రుడు కంటే వైశ్యుడు ఉన్నతంగా చూడబడతాడు. ఇది మనుషులందర్నీ సమానంగా చూసే మతం కాదు.

ఈ మతమూ, సాంఘిక కట్టుబాట్ల క్రమమూ మనల్ని నాశనం చేసాయి. కానీ ఈ వినాశనం ఇక్కడితో ఆగబోతు. ఇది హిందువుల్ని, అంతిమంగా భారతదేశాన్ని కూడా నాశనం చేయనుంది.

నేను ఊరకనే హిందూమతాన్ని నిందించదల్చుకోలేదు. ఈ మతం ఎవ్వరినీ రక్షించలేదు. ఇందులో ఇక జీవమనేదేదీ మిగలలేదు.

మన దేశం ఎందుకు అన్నిసార్లు స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్ని కోల్పోయింది? ఎందుకు మనం అంతకాలం పాటు విదేశీపాలన కింద మగ్గిపోయాం? ఎందుకనంటే, ఈ దేశం కలసికట్టుగా ఎన్నడూ శత్రువుని ఎదుర్కోవడానికి సిద్ధమవ్వలేదు కనుక.

సమాజంలోని చిన్న సమూహంపై ఆధిపత్యం వహించేవాళ్ళు అందుకే సులభంగా విజేతలయ్యారు. హిందూవుల్లోని వినాశకరమయిన వర్ణవ్యవస్థే ఇందుకు కారణం.

1939–45 మధ్య కాలంలో రెండవ ప్రపంచ యుద్ధంలో యూరప్ పాల్గొంది. అందులో సైనికులు చనిపోయిన వెంటనే కొత్త సైనికులు నియమించబడేవారు. యుద్ధంలో పొందిన విజయం ఫలానా సమూహం వల్లనే అని ఎవరూ చెప్పగలిగేవారు కాదు. సమాజంలో నిర్దిష్టమైన బృందమే గెలుపుకి కారణమని ఉండేది కాదు. అదే మనదేశంలో ప్రాచీన కాలంలో క్షత్రియులు కనుక యుద్ధంలో మరణిస్తే క్షుద్ర చాతుర్వర్ణ ధర్మం ప్రకారం మరొకర్ని నియమించడానికి వీలులేదు. ఎందుకనంటే క్షత్రియులు మాత్రమే యుద్ధానికి అర్హులు. గతంలో జరిగిందిదే. ఈ దేశం బానిసత్వంలో చాలా కాలంపాటు మగ్గడానికి కారణం ఇదే. అదీ మాకే కనుక ఆయుధాలు నిరాకరించకుండా కూడా వాటిని కలిగివుండే హక్కే ఉన్నట్లయితే, ఏ ఆక్రమణ దారుడూ ఈ దేశాన్ని జయించలేకపోదుడు. అనేకసార్లు ఈ దేశం తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్ని చొరబాటుదారుల చేతుల్లో కోల్పోయి ఉండేది కాదు.

హిందూమతం ఎవ్వరినీ రక్షించలేదు, ఎవ్వరికీ అభయం ఇవ్వలేదు. హిందూమతంలో ఎవ్వరికీ మోక్షమే లేదు. హిందూమత శాస్త్రాల ప్రకారం అగ్రకులాలు మాత్రమే ప్రయోజనాలు పొందగలవు. నా ఈ మాటల్లో అతిశయోక్తి లేదు. ఇంతవరకూ శూద్రులు లేదా అంటరానివారు పొందినదేమిటి?

బ్రాహ్మణ స్త్రీ తను కనబోయే బిడ్డ కొరకు ఏ ఉన్నత న్యాయస్థానంలోని న్యాయమూర్తి పదవిని గురించో కలలుకంటే, మన స్త్రీలు మాత్రం పురపాలక సంఘంలో పారిశుద్ధ్య కార్మిక పని మినహా మరిక మెరుగైన ఉద్యోగాన్ని గురించి ఆలోచించలేరు.

ఇలాంటి దుర్భరమయిన పరిస్థితులు హిందూమతం చేసిన బోధనలవల్లే తలెత్తాయి. మేము హిందూమతంలోనే కనుక కొనసాగితే ఈ మా బానిస బతుకుల్లో మార్పునేదేదీ రాదు. హిందూ మతాన్ని విడనాడి బుద్ధుడి మార్గాన్ని అనుసరించడమే మా జీవితాలకి ఆశనీ – నమ్మకాన్ని కల్పిస్తుంది. ఇప్పుడిక మమ్మల్ని బౌద్ధాన్నీ, బుద్ధుని బోధనలను అనుసరించనివ్వండి.

సమానత్వం అనేది బౌద్ధం యొక్క మౌలిక సూత్రం. బుద్ధుని కాలంలో బిక్కువులుగా బౌద్ధాన్ని స్వీకరించీ అనుసరించినవారిలో 75% శాతం మంది

బ్రాహ్మణులు కాగా మిగిలిన 25% శాతం మంది శూద్రులు. తర్వాత కాలంలో బౌద్ధం,శూద్ర మతంగా పిలవబడింది.

"ఓ భిక్షువులారా, మీరు భిన్న కులాలకి, విభిన్న ప్రాంతాలకి చెందినవారై ఉండవచ్చు, ఐతే, గొప్ప గొప్ప నదులన్నీ సముద్రంలో వెళ్ళి కలవగానే వాటి అస్తిత్వాన్ని కోల్పోయి మహాసముద్రంగా మారినట్లుగానే, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాల వారంతా కూడా, అనేకపేర్లు, వివిధ హోదాలు ఎన్ని ఉన్నప్పటికీ తథాగతుని సిద్ధాంతాన్ని అనుసరించడం ద్వారా సంఘంలో సమానులౌతారు."

ఇవీ బుద్ధుని వాక్కులు. వేర్పాటువాదానికి, అంటరానితనానికీ వ్యతిరేకంగా గొంతువిప్పిన ఒకే ఒక్క మనీషి మహాత్మ బుద్ధుడు.

ఆరంభంలో బుద్ధుని వద్ద పది పన్నెండు మంది బిక్కువులు మాత్రమే ఉండేవారు. వీరిలో తొమ్మిదో లేదా పదిమందో శూద్రులు. బిక్కువుల స్వీయచరిత్రలుగా రాసుకున్న గాధలయిన థేరగాధ, థేరీగాథల్లో ఇందుకు సంబంధించిన వివరాలున్నాయి. కులాన్ని అసలు గుర్తించకుండా అభివృద్ధికి అవకాశం కల్పించిన మతం ఒక్క బౌద్ధమేననే విషయం వారి రాతల వల్ల రుజువు అవుతోంది.

నా రాజకీయ కార్యకలాపాల్ని నిశితంగా పరిశీలించే నా రాజకీయ ప్రత్యర్థులు నన్నో గుంటనక్కంటారు. వాళ్ళనేదేమంటే నేను షెడ్యూల్ కులాలకి వీలయినన్ని రాయితీల కోసం సాధ్యమయినంతగా ప్రయత్నిస్తానని, ఎంత దూరమైన వెళ్ళడానికి వెనుకాడననీ. మరికొద్దిమంది అనుకుంటున్నదేమంటే ఎందుకు ఈ నిర్ణయం తీసుకోడానికి నేను ఇంత సుదీర్ఘకాలం ఆగాల్సి వచ్చిందని? మతం మారడమనే విషయానికి సంబంధించీ, ఇన్ని సంవత్సరాల్నుంచీ 'మరేం చేస్తున్నారు మీరు?' అని వాళ్ళడిగే ప్రశ్న. నేను ఇవ్వదగ్గ ఏకైక జవాబు ఏమంటే, మతానికి సంబంధించిన అంశం చాలా సంక్లిష్టమైందీ, గంభీరమైందీను. బౌద్ధ మతానికి చెందిన ఆదర్శాల్నీ, నైతిక విలువల్నీ ప్రజానీకంలోకి తీసుకుని వాళ్ళ, ధర్మానికి అనుగుణంగా వారంతా తమ జీవితాల్ని మలుచుకుని మానవీయంగా తీర్చిదిద్దుకునేలా చేయడమనేది బృహత్తరమయిన బాధ్యత. ఇంతటి కఠినతరమయిన కర్తవ్యాన్ని ఎవరూ తలకెత్తు కున్నట్లు నాకు తెలీదు, ఇకమీదట ఎవరయినా ఎత్తుకుంటారని కూడా నేననుకోను. ఇంకొన్ని సంవత్సరాలు నేను జీవించి ఉన్నట్లయితే, ఈరోజు నేను మొదలుపెట్టిన పనిని దిగ్విజయంగా ఒక కొలిక్కి తీసుకువచ్చి పూర్తి చేయగలను.

కొంతమంది సహజంగానే అడిగే ప్రశ్న, 'అంటరానివారు బౌద్ధాన్ని స్వీకరించడం వల్ల ఏమొస్తుందని?' ఇదో పనికిమాలిన ప్రశ్న.

ధనవంతులకి మతం ఏమవసరం? లేదు, బహుశా ఉండదు. ఎవరైతే పెద్ద పెద్ద హోదాల్లో ఉన్నారో, ఉండడానికి భారీ బంగళాలు, సౌకర్యాలన్నిటినీ పొందడానికి కావాల్సిన సంపద, పనులు చేసేందుకు సేవకులు... ఇలాంటి వారికి మతం వల్ల ఏవోకొన్ని ప్రయోజనాలుండొచ్చేమో.

నా జర్మన్ ప్రొఫెసర్ వింటర్ నిట్జ్ నన్ను 'ది వాటర్ గ్యాంగ్ రాబిలన్ డెప్ట్' పుస్తకం చదవమనడం నాకిప్పుడు జ్ఞాపకం వస్తోంది. 'పేదవారికి మాత్రమే మతం అవసరం' అంటూ, కాబట్టి "మనకి మతం అవసరం" అంటారాయన. నమ్మకమనేది జీవితాన్ని నడిపించే రుతువులాంటిది. మతం అలాంటి నమ్మకాన్ని ఇస్తుంది. అందుకే మానవాళికి మతంలో శాంతి కనిపించింది, మతం వల్ల మనుషులు వోదార్పు పొందింది. పేదలు మతాన్ని పట్టుకు వేలాడడానికి అదే కారణం.

క్రైస్తవ మతం యూరోప్‌లోకి ప్రవేశించినపుడు రోమ్ చుట్టుపక్కల పరిస్థితి భయంకరంగా ఉంది. ప్రజలు వారి కడుపు నింపుకోడానికింత ఆహారం కూడా సరిగా దొరికేది కాదు. వారు కటిక పేదరికంలో జీవించారు. కానీ, మరి క్రైస్తవ మత ఆగమనానికి సానుకూలంగా స్పందించి, దానిని వ్యాప్తి చేసినవారు ఎవరో తెలుసా? క్రైస్తవ ఆధ్యాత్మికతని అంగీకరించిన వారెవరూ కాదు, తిండిలేక ఉచితంగా పంచే గంజితాగి బతికే అభాగ్యులు, అణగారిన ప్రజానీకమే. రోమన్ ప్రభువుల దగ్గర ఊడిగం చేసే బానిసలు, సేవకులే క్రైస్తవ మత ప్రచారకులయ్యారు. 'రోమన్ సామ్రాజ్య పతనం' గ్రంథం రాసిన గిబ్బన్ క్రైస్తవ్యాన్ని బీదల, ముష్టివాళ్ళ మతమని అపహాస్యం చేసాడు. గిబ్బన్ ఈరోజు బతికిలేడు. ఉంటే, యావత్ యూరోపు క్రైస్తవానికి దాసోహమవడం చూసి నిర్ఘాంతపోయుండేవాడు.

ఇక్కడ భారతదేశంలో కూడా కొద్దిమంది బౌద్ధాన్ని అంటరానివారి మతం అంటారు, సందేహమేం లేదు. ఇంకా అనేక రకాల హాని చేస్తారు. అవమానకరమైన వ్యాఖ్యలూ చేస్తారు. అప్పట్లో బ్రాహ్మణులు బుద్ధుడ్ని కూడా వదల్లేదు. చాలా అసంబద్ధంగా వ్యవహరిస్తూ, 'ఒరేయ్ గౌతమ' అని పిలుస్తుండేవారు. వారు బుద్ధుడ్ని అగౌరవపరచాలనీ, అవమానించాలనీ తీర్మానించుకుని అలా చేసేవారు.

ఇన్ని రకాలుగా అడ్డగించినప్పటికీ, అవమానించినప్పటికీ, దుర్భాషలాడి దుష్ప్రచారాలు చేసినప్పటికీ యూరోపు, అమెరికా వంటిచోట్ల బౌద్ధం హిందూ మతం కంటే మెరుగ్గా నిలదొక్కుకుంది. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఆయా దేశాల్లో రాముడు, కృష్ణుడు, శివుడు లేదా ఇతర హిందూ దేవుళ్ళ బొమ్మలు అమ్మకానికి పెడితే వాటినసలెవరూ కొనరు, కానీ బుద్ధ ప్రతిమలు ఉదయం అమ్మకానికి పెడితే సాయంత్రానికి ఒక్కటి కూడా మిగలదు.

భారతదేశం వెలుపల అందరూ ఆదరించి, గౌరవించే పేరేదైనా ఉందంటే అది రాముడిదో, కృష్ణుడితో కాదు, బుద్ధుడిది మాత్రమే. భారతదేశం వెలుపల రాముడు, కృష్ణుడూ ఎవరికీ తెలియదు.

ఈ మన మతం ప్రపంచమంతటా ఎందుకు వ్యాపించలేదో కారణం కనబడదు. మనం మతస్తులుగా ఎలా జీవిస్తున్నామనేది ప్రధానం. మనం ఎంచుకున్న మార్గంలో నిస్సంకోచంగా ముందుకెళదాం. మనం జీవన విధానానికి సంబంధించినొక నూతన మార్గాన్ని ఏర్పరుచుకున్నాం, దానినే అనుసరిస్తాం. ఈ మార్గం పురోగతికి దారితీస్తుంది.

నిజం చెప్పాలంటే, ఇదంత కొత్తదేమీ కాదు, మనం దీనిని బయటనుంచీ దిగుమతి చేసుకోలేదు. బౌద్ధం ఈ దేశపు మతం. ఇది రెండువేల సంవత్సరాల పూర్వంది. ఇంతటి ప్రాచీనమయిన, మానవీయమయిన, మహత్తరమయిన మతంలోనికి ఇంతకుముందే నేను మారలేకపోయినందుకు గానూ బాధ పడుతున్నాను.

బుద్ధుని బోధనలన్నీ నిత్యసత్యాలు. కానీ వాటిని కూడా ఆయన ఎప్పుడూ పరిపూర్ణమయినవని ప్రకటించలేదు. కాలానుగుణంగా మారేటువంటి సామర్థ్యం బౌద్ధానికి ఉంది, మరే ఇతర మతానికీ ఈ విశిష్టమయిన లక్షణం ఉందని చెప్పలేము.

భారతదేశంలో బౌద్ధ పతనానికి ప్రధాన కారణం ముస్లిం దండయాత్రలు. వేలాది బౌద్ధ ప్రతిమలు విరగ్గొట్టి ధ్వంసం చేయబడ్డాయి. అనేక విహారాలు విధ్వంసమయ్యాయి. వేలమంది భిక్షువులు హత్య కావించబడ్డారు. అమానవీయమైన ఈ రక్తపాతం పట్ల భయకంపితులయిన భిక్షువులు పక్కనే ఉన్న దేశాలకి ప్రాణాలరచేతిలో పెట్టుకుని పారిపోయారు. కొంతమంది టిబెట్, మరికొంతమంది

చైనా వెళ్ళిపోయారు; అలా ప్రపంచమంతటా విస్తరించారు. ఫలితంగా ఈ దేశం నుండి బిక్కువులు అదృశ్యమైపోయారు. ధర్మాన్ని పాటించేవాళ్లు క్లిష్ట కాలంలో ధర్మాన్ని రక్షించుకోడానికి సిద్ధంగా ఉండాలి. గ్రీకు రాజయిన మిళిందుడు వాయవ్య ప్రాంతాన్ని పరిపాలిస్తున్నప్పుడు మత వ్యవహారాలలో నిపుణుడిగా పేరొందాడు. విద్యావంతుడయిన ఈ రాజు బ్రాహ్మణ పండితుల్ని అనేకసార్లు వాదనల్లో ఓడించాడు, అనేక మత సంబంధ చర్చల్లో ఎంతోమందిని మట్టికరిపించాడు. బుద్ధుని బోధనలచేత ఆకర్షింపబడిన మిళిందుడు బౌద్ధ పండితుల్నీ, బిక్కువుల్ని సంవాదానికి ఆహ్వానించేవాడు. ఐతే రాజుతో చర్చకి ఎవరూ భయపడి సిద్ధపడేవారు కాదు. మిళ్లిందుడు తన ఆస్థాన పండితులతో ధర్మాన్ని బోధించే బిక్కువు ఎవరినయినా చర్చకు తీసుకురావాల్సిందిగా సూచించాడు. అప్పుడు పండితులు బహుముఖ ప్రజ్ఞాశాలి ఐన నాగసేనుడ్ని సంప్రదించారు. నాగసేనుడు అసాధారణమయిన సామర్థ్యం గల బౌద్ధ భిక్షువు. రాజైన మిళిందునికీ, బౌద్ధ భిక్షువైన నాగసేనుడికి మధ్య జరిగిన ప్రశ్నోత్తరాల సంవాదం అంతా సేకరించి గ్రంథరూపంలో నిక్షిప్తం చేయడం జరిగింది. దానిని 'మిళంద పన్హా' అనే పేరుతో పిలుస్తారు. ఆ గ్రంథంలో ఒక ప్రశ్న అడగబడింది;

"మతం నాశనం కావడానికి కారణాలేమిటి? ఎందువల్ల మతం పతనమౌతుంది?" దానికి నాగసేనుడు జవాబు చెబుతూ, 'మతం పతనమవడానికి ముఖ్యంగా మూడు కారణాలున్నాయి. (I) మతం యొక్క మౌలిక సూత్రాలు బలంగా లేకుండా దాని పునాది బలహీనంగా ఉన్నప్పుడు (II) మత బోధకులు, ప్రచారకులు చాలినంత విద్యావంతులు కారో, ఇతర మతాల బోధకుల్ని, ప్రచారకుల్ని సంవాదాల్లో సరిగ్గా ఎదుర్కొనలేరో, (iii) ప్రధానమైన మతసూత్రాలు ఆరాధనా స్థలాల్లో, ప్రజా బాహుళ్యానికి సులభంగా అర్థమయ్యే విధంగా అనువాదమై ప్రచారం కాలేవో అటువంటి మతం త్వరగా నాశనమవుతుంది' అంటాడు.

సత్యం, న్యాయం, ధర్మంపై ఆధారపడని బలహీనమయిన ఆదర్శాలు గల ఏ మతమూ ఎక్కువ కాలం మనలేదు. అటువంటి మతానిది ఎప్పుడూ తాత్కాలిక అస్తిత్వమే. కాలక్రమంలో అది క్షీణించి కనుమరుగవ్వక తప్పదు. రెండోది, ధర్మాన్ని బోధించి ప్రచారం చేసేవాళ్ళెవరూ లేకపోతే అది అభివృద్ధి చెందకుండా అంతిమంగా అంతరించి పోతుంది. విద్యావంతులు, మేధావులు మతాన్ని వారి దైనందిన జీవితంలో

భాగం చేసుకుని చర్చించగలగాలి. ధర్మశాస్త్ర గ్రంథాల్ని క్షుణ్ణంగా చదివి విమర్శకుల, లేదా వ్యతిరేకుల ప్రశ్నలకు జవాబివ్వగల పండితులు లేకపోయినా మతం మరణిస్తుంది. సామాన్యుల ఆరాధన కోసం లేదా ప్రార్థన, ఓదార్పు కోసం విహారాలకి వెళ్ళినపుడు ధర్మశాస్త్ర పండితులు ధర్మసూత్రాలను ఆయా 'ఉపాసకులకు' క్షుణ్ణంగా, సులభంగా వివరించగలగాలి.

బౌద్ధానికి సంబంధించీ ఈ నాలుగు విషయాల్ని మీరు దృష్టిలో ఉంచుకోవాలి. బౌద్ధ బోధనలు తాత్కాలికమైనవని మీరెప్పుడూ అనుకోకూడదు. 2500 సంవత్సరాల సుదీర్ఘకాలం తర్వాత కూడా బుద్ధుని బోధనలను ప్రపంచమంతా గౌరవిస్తోంది. అమెరికాలో దాదాపు బౌద్ధాన్ని అనుసరించే సంఘాలు 2000 వరకూ ఉన్నాయి. ఇంగ్లాండులో 3 లక్షల రూపాయిలతో బుద్ధ మందిరం నిర్మించారు. జర్మనీలో బుద్ధుని పేరిట మూడు నాలుగువేల సంస్థలు స్థాపించబడి క్రియాశీలంగా పనిచేస్తున్నాయి.

బుద్ధ భగవానుడి బోధనలన్నీ నిత్య నూతనమయినవీ, శాశ్వతమైనవీ అయినప్పటికీ, బుద్ధుడు తనని తానెప్పుడూ పురుషోత్తముడిగా భావించలేదు, తన సిద్ధాంతాలు అంతిమమని ప్రచారం కూడా చేసుకోలేదు. తనకి గాని తన మతానికి గానీ ఎన్నడూ దైవత్వాన్ని ఆపాదించుకోలేదు. బుద్ధుడు తానెప్పుడూ దేవుని కుమారుడినని కానీ ఆఖరి దైవ ప్రవక్తనని గానీ చెప్పుకోలేదు. పైగా, అందుకు విరుద్ధంగా 'నా తల్లితండ్రులు సామాన్య మానవుల'ని ఆయన చెప్పుకున్నాడు.

సరే, మరీ బౌద్ధానికి ఆధారం ఏమిటి? ఏ పునాదులపై బౌద్ధం నెలకొల్పబడింది? మీరు కనుక క్షుణ్ణంగా అధ్యయనం చేస్తే బౌద్ధం 'హేతువు' పునాదిగా గలదని తెలుస్తుంది. అందుకే బౌద్ధంలో ఇంకేమతంలోనూ లేని, స్వాభావికంగానే పరిస్థితులకి అనుగుణంగా మారుతూ, మార్పుతోనే ముందుకెళ్ళే గుణం ఉంది.

బౌద్ధాన్ని దృఢంగా ఎవరయితే నమ్ముతారో వారే బౌద్ధులుగా మారగలరు. ఈ మతంపై విశ్వాసం లేనివారు, ఇది వారికి వర్తించదనుకునేవారు బౌద్ధులుగా మారలేరు. ఇందులోని ఉన్నతాశయాలు మరే ఇతర మతంలోనూ కనబడవు. ఇతర మతాల ప్రాపంచిక దృక్పథాలకీ బౌద్ధానికీ గల తాత్విక దృష్టి కోణానికీ చాలా

వ్యత్యాసం ఉంది. ప్రధాన బౌద్ధ సూత్రాలేవీ కూడా ఆధ్యాత్మిక, ఆస్తిక మతాల కోవలోకి రావు. ఇతర మతాల ప్రకారం ఈ ప్రపంచాన్ని దేవుడే సృష్టించాడు. భూమినీ, నీటిని, స్వర్గాన్ని, చంద్రుడ్ని, ఇతర గ్రహాలన్నింటినీ కూడా ఆయనే చేసాడు. అంటే మన మూత్రాశయాల్లో ఉన్న రాళ్ళతో సహా సర్వం ఆయనే సృష్టించాడు. అవసరమయినవన్నీ దేవుడే చేసేసాడు కాబట్టి మనం ఏమీ ఇక చేయాల్సిన అవసరం లేదు, ఇక చేయాడానికేమీ మిగలాలేదు. సర్వశక్తివంతుడైన దేవుడ్ని స్తుతిస్తూ భజనలుచేయడమొక్కటే మనకి మిగిలింది. ఇది ఈనాటి హేతువాదైన మానవుడికి వర్తించేది కాదు.

బౌద్ధం దేవుడి అస్తిత్వాన్ని నిరాకరిస్తుంది, ఆత్మని తిరస్కరిస్తుంది. నిజమయిన బౌద్ధం హేతుబద్ధమయిన రీతిలో దుఃఖ నివారణ కోసం ప్రయత్నిస్తుంది. 'లోకమంతటా దుఃఖంతో నిండి ఉంది' అంటాడు బుద్ధుడు. 90 శాతం మంది ప్రజలు వివిధ రకాలుగా దుర్భర పరిస్థితుల్లో జీవిస్తూ బాధలు పడుతున్నారు. మానవాళిని దుఃఖం నుండి విముక్తి చేయడమే బౌద్ధం యొక్క ప్రధాన ఉద్దేశం. మరలాంటప్పుడు దాస్ కేపిటల్ వల్ల ప్రయోజనం ఏంటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. బుద్ధుడితో పోలిస్తే కార్ల్‌మార్క్స్ చాలా వెనకబడి ఉన్నాడని నా నమ్మకం. ఆయన చెప్పిన చాలా విషయాల్లో, రెండువేల సంవత్సరాలకి పూర్వమే, అంటే మార్క్స్ పుట్టడానికి చాలా ఏళ్లకి ముందే బుద్ధుడు స్వయంగా బోధించని విషయం ఏదీ లేదు.

ఇక్కడ చాలామంది కమ్యూనిస్టు మిత్రులున్నారు. అలాంటి వారిలో ఒక విలేఖర్ని నేను, 'మార్క్స్ లక్ష్యంతో పోలిస్తే బుద్ధుని లక్ష్యం ఏ విధంగా భిన్నమైనది?' అని అడిగాను. బుద్ధుడు ఏదయితే బోధించాడో అదంతా చాలా సులభం, బౌద్ధానిది వంకరలులేని తిన్నని మార్గం. బౌద్ధం సర్వ సమగ్రమయిన మతం.

నాకున్న చదువు, జ్ఞానము, మేధస్సు అనుభవంతో చెడుని వ్యతిరేకించడం నాకేమంత కష్టం కాదు. కానైతే సమాజంలో కులతత్వం పర్వతాలంత భారీగా పెరిగిపోయింది. బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియులు మా నెత్తినెక్కి కూర్చున్నారు. వారిని పడగొట్టి ఈ కులాధిపత్యాన్నెలా ధ్వంసం చేయాలనేదే మన ముందున్న ప్రశ్న. ఆ కారణం చేతనే నేను మీకు బౌద్ధాన్ని పరిచయం చేస్తున్నాను. ఈ బాధ్యతని నేను ఇలా నెరవేరుస్తున్నాను.

బౌద్ధం మరణశయ్య మీదున్న మతం అనీ భౌతికంగా అదెన్నడో మరణించిందనీ కొద్దిమంది అంటారు. అలాగైతే, దానిని మెరుగుపర్చి మంచి దశకి తీసుకురావలసిన కర్తవ్యం మన మీద ఉంది. ప్రజల్లో ఉత్సాహం, స్ఫూర్తి, గౌరవభావం పెరిగేలా మనం ప్రవర్తించాలి. ఏదయినా ప్రశాంతమయిన తోటలోనో, ఆరాధనా స్థలంలోనో ప్రసంగాలను ఏర్పాటు చేసుకోవాలి.

పుస్తక రచన ద్వారా మీ సందేహాలు నివృత్తి చేయడం ద్వారా నా శక్తికొలదీ నేను చేయాల్సినంత కృషి చేస్తాను. నేను ఈరోజు కోరుకునేదల్లా మీరు నాపై నమ్మకం ఉంచి నన్ననుసరించండి. మీరు నాపై ఉంచిన నమ్మకాన్ని వమ్ము కానివ్వను. వ్యక్తిగత ప్రయోజనాల కోసం నేను పనిచేయను. మీ అనుమానాలన్నింటినీ సంతృప్తికరంగా నివృత్తి చేయడానికి సదా ప్రయత్నిస్తాను.

ఇప్పుడు మీ భుజస్కంధాల మీద కూడా గొప్ప బాధ్యత ఉంది. చెడ్డపేరు తీసుకొచ్చే పనులేవీ మీరు చేయకూడదు. గౌరవం పొందతగిన రీతిలో ఉన్నతంగా జీవించాలి. మీ మెడకు కుక్క తాడులా కట్టిన మతమిదని భావించకండి.

బౌద్ధానికి సంబంధించినంతవరకూ ఈ మన దేశం ఎడారి లాంటిది. ఇప్పుడు ధర్మానికి గత వైభవం తీసుకొచ్చి పునరుద్ధరించాల్సిన బాధ్యత మీమీద ఉంది. మీరందుకోసం నిజాయితీగా ప్రయత్నించాలి. మీరలా కనుక చేయలేకపోతే, ఈ దీక్షా కార్యక్రమాన్నీ, మత స్వీకారాన్నీ ప్రజలు అవహేళనగా చూస్తారు, ఇదంతా నవ్వులపాలవుతుంది.

బౌద్ధం ఈ దేశానికే కాదు ప్రపంచం అంతటా వర్తించే మతం. లోక వ్యవహారాలలో ప్రపంచ శాంతికి అనివార్యమైనది బౌద్ధం. మీరు మీ విముక్తి కోసం మాత్రమే కాదు, దేశ ఉన్నతి కోసం, ప్రపంచ పురోగతి కోసం కూడా పాటు పడతామనీ ఈ రోజు ప్రమాణం చేయాలి.

మీరెత్తుకున్న కర్తవ్యం అపారమైంది. ఈ బాధ్యతకి న్యాయం చేయాలంటే మీరు బాగా కష్టపడాలి. ఈ విషయాన్ని మీరు మనసులో ఎల్లప్పుడూ ఉంచుకోవాలి. ఈనాటి వరకూ మనలో ఎక్కువ మందిమి కడుపుకోసం మాత్రమే కష్టపడ్డాం. ఇప్పుడిక ఆ స్వార్థం, వ్యక్తివాదం పనికిరాదు. మీ దృక్పథం సంకుచితంగా, స్వార్థపూరితంగా ఉండరాదు.

మహత్తరమైన ఈ మత ప్రచారం కోసం మనకి డబ్బులు అవసరం. అందుకు కావాల్సిన ఆర్థిక సహాయాన్ని ఏ విదేశాల నుంచో తీసుకునే ఆలోచన నాకు లేదు.

మీరు మీకొచ్చే ఆదాయంలో 1/20 శాతం ధర్మ ప్రచారం కోసం కేటాయించాలి. నేను మీ అందర్నీ నాతో తీసుకెళతాను. బుద్ధ భగవానుడు తన దీక్ష స్వయంగా తానే తీసుకున్నాడు. ఒక్క వ్యక్తిమీదనే పని భారమంతా పడినప్పుడు, తన అనుచరుల్లోని సమర్థులైన వారు పని బాధ్యతని పంచుకోడానికి అనుమతిచ్చేవాడు. మీరు యాషుడి పేరు వినే ఉంటారు. యాషుడు సియోన్ వంశానికి చెందిన ధనవంతుడు. అతడు నలభైమందితో కలిసి దీక్ష స్వీకరించినపుడు బుద్ధుడు వారితో, “నా ఈ మతం అనేకమందికి మంచి చేస్తుంది; అనేక మందికి చేసే మంచిలోనే అనేకమంది యొక్క సంతోషం ఇమిడి ఉంది. ఈ మంచి ఆరంభంలోనూ, మధ్యలోనూ, ముగింపులో కూడా ఉంటుంది” అంటాడు. కాబట్టి, సోదరసోదరీమణులారా ఇది నా మతం.

ఆ కాలంలో బుద్ధుడు నాటి పరిస్థితులకు తగినట్లుగా మత ప్రచార పద్ధతుల్ని పాటించాడు. అలాగే మనం కూడా ప్రస్తుత పరిస్థితులకి అనుగుణమైన ప్రచార విధానాన్ని అవలంభించాలి. ఈ పని చేయడానికి ఈ దేశంలో భిక్షువులెవరూ లేరు. కాబట్టి ఈ బృహత్తరమైన ‘దీక్ష’ను మీలో ప్రతి ఒక్కరూ స్వీకరించాలి. ఇతరుల్ని తన విశ్వాసంలోనికి మల్చుకునే హక్కు బౌద్ధునికి ఉంది. తర్వాత ఏదైనా ఇబ్బంది వస్తే నియమాలానుసారం అలాంటి పరిస్థితుల్ని ఎదుర్కోడానికి మనమెప్పుడూ సంసిద్ధంగా ఉండాలి. ధమ్మ ప్రచారం కోసం కావాల్సిన భారీ యంత్రాంగాన్ని మనం సిద్ధం చేసుకోవాలి. ప్రతీ బౌద్ధుడికీ ఇతరులకి దీక్ష ఇచ్చే హక్కు ఉంది. నేనీరోజు ప్రకటిస్తున్నాను; ‘బుద్ధుని సందేశం తీసుకుని ముందుకెళ్ళండి, వెళ్ళి ప్రజల్ని విముక్తి చేయండి’.

✳ ✳ ✳ ✳ ✳

- *D.C. Ahir, Dr. Ambedkar on Buddhism, People's Education Society, Bombdy, 1982.*

# 5. బుద్ధిజం - కమ్యూనిజం

*భారీ ఎత్తున జరిగిన నాగపూర్‌లోని ధమ్మ దీక్షా స్వీకార కార్యక్రమం అనంతరం, కొద్దికాలం తర్వాత డా॥ బి.ఆర్. అంబేద్కర్, ప్రపంచ బౌద్ధ నాలుగవ సద్భావన సదస్సులో పాల్గొనడానికి నేపాల్ వెళ్లాడు. 1956 నవంబర్‌లో ఖాట్మండ్‌లో జరిగిన ఈ అంతర్జాతీయ సమావేశంలో అంబేద్కర్, మొదటిసారి బౌద్ధుడిగా మారాక పాల్గోవడం జరిగింది. ప్రపంచవ్యాప్తంగా అనేక ప్రాంతాల నుండి వచ్చిన బౌద్ధులందరూ సమకాలీన పరిస్థితుల్లో బౌద్ధం ఎదుర్కొంటున్న సమస్యలకు సంబంధించీ, ముఖ్యంగా కమ్యూనిజం విసురుతున్న సవాళ్ళకు సంబంధించీ బాబాసాహెబ్ అంబేద్కర్ భావాలు వినడానికి చాలా ఉత్సాహంగా ఉన్నారు. వాళ్ళందరి అభ్యర్థన మేరకు 1956, నవంబర్ 20న అంబేద్కర్ బుద్ధిజం - కమ్యూనిజం అనే అంశంపై విశ్లేషిస్తూ, ముందుగా:*

అధ్యక్షులు ఇంకా గౌరవనీయ పెద్ద మనుషులు

అందరికీ,

ఈ సమావేశంలో పాల్గొనాల్సిన ప్రతినిధులు పాటించాల్సిన పద్ధతుల్నీ, రీతిరివాజుల్ని పాటించనందుకు ముందుగా మీరంతా నన్ను మన్నించాలి. ఐతే, శారీరకంగా అనారోగ్యంతో బాధపడుతున్న నేను సమావేశ పద్ధతుల్ని అలసట, ఒత్తిడి కారణంగా పాటించలేకపోవడాన్ని మీరంతా అర్థం చేసుకుంటారనే అనుకుంటున్నాను. నా వ్యక్తిగత పరిస్థితి రీత్యా యీ పనికి న్యాయం చేయలేనేమో అనే కారణం చేతనే నేను సాధారణంగా సమావేశాలకి రావడం లేదేమో తప్పా సభలపట్ల నాకు చిన్నచూపు లేదు. గతంలోని సమావేశాలకి రాకపోవడానికి పరిహారంగా బహుశా నన్ను ఈ నిర్దిష్టమైన అంశం గురించి ఈ మధ్యాహ్నం ప్రసంగించమన్నారు. నేనందుకు అంగీకరించాను, ఐనప్పటికీ నాకిది ఆశ్చర్యకరమయిన విషయమే. ఇక్కడ ప్రసంగించవలసి ఉంటుందని ముందుగా నేను అనుకోలేదు. తర్వాత ఏ అంశం మీద మాట్లాడాలనే చర్చ వచ్చినపుడు 'బౌద్ధంలో అహింస' అనే అంశం గురించి మాట్లాడతానన్నాను. కానీ, ఈ సమావేశానికి వచ్చిన అశేషమయిన ప్రజానీకం నన్ను 'బౌద్ధం - కమ్యూనిజం' అనే అంశం మీద మాట్లాడాల్సిందిగా కోరుతున్నారనే విషయం తెలిసింది. ప్రసంగ విషయం మార్పుని

నేను ఒప్పుకున్నప్పటికీ, అంత పెద్దదైన, విస్తారమైన, ఇలాంటి భారీ విషయం గురించి మాట్లాడ్డానికి ప్రస్తుతం నేను సిద్ధంగా ఉన్నానా అనేది సందేహమే. ప్రపంచంలో సగ భాగం నేను ప్రసంగించబోతున్న అంశం గుప్పిట్లో ఉంది. బౌద్ధ దేశాల్లోని విద్యార్థిలోకం కూడా పెద్ద ఎత్తున దీని ప్రభావంలో చిక్కుకున్నారు. ఇది నాకు తీవ్రమైన ఆందోళనను కలిగిస్తోంది. కమ్యూనిస్టు జీవన విధానంతో పోలిస్తే అంతకంటే మెరుగైన జీవన విధానాన్ని బౌద్ధం అందించగలదనీ బౌద్ధ దేశాలలోని యువతరం కూడా నమ్మకపోయినట్లయితే అది చాలా విచారించాల్సిన విషయం. కమ్యూనిజానికి ప్రత్యామ్నాయంగా బౌద్ధాన్ని పరిచయం చేయడంలో మనం కనక విఫలమయితే ఇది ఈ ఒక్క తరం యువతతో ఆగేది కాదని గుర్తించాలి. అప్పుడు మాత్రమే బౌద్ధం ఉనికిలో ఉండగలదు. యూరప్, ఆసియాల్లో పెద్ద ఎత్తున ప్రజానీకం, ముఖ్యంగా యువతరం ఈరోజు కార్ల్‌మార్క్స్‌ని ఏకైక ప్రవక్తగా ఆరాధిస్తున్నారనే విషయం మనందరం గుర్తుంచుకోవాలి. వాళ్ళ దృష్టిలో బౌద్ధ సంఘ సమాహారమంతా ఏదో పసుపురంగు కాషాయ మేళమే తప్పా పెద్ద ప్రమాదకారి కాదు. సరిగ్గా ఈ అంశాన్నే బిక్షువులు తీసుకుని అర్థం చేసుకోవాలి, కార్ల్‌మార్క్స్‌తో పోటీగా పోల్చి స్వీయ సంస్కరణ దిశగా సాగుతూ బౌద్ధాన్ని బలోపేతం చేయాలి.

ఇప్పుడు ఈ పరిచయంతో నేను బౌద్ధాన్నీ, మార్క్సిజాన్నీ లేదా కమ్యూనిజాన్నీ, ఈ రెంటిలోనూ ఉన్న ఆదర్శాల్లోని సారూప్యతలనూ, వ్యత్యాసాలనూ ప్రతిపాదించడానికి ప్రయత్నిస్తాను. బుద్ధిజం – కమ్యూనిజాల్లో ఏ విధానం తన లక్ష్యాన్ని సాధించేందుకు చివరిదాకా నిలవగలుగుతుందో బేరీజు వేసుకోవడం అవసరం. లక్ష్యసిద్ధిలేని సిద్ధాంతాన్ని పాటించడం వల్ల ప్రయోజనం లేదు. అలాంటి మార్గాన్ని అవలంభించడం అరణ్యాలకో, అరాచకత్వానికో దారితీస్తే, అందువల్ల ఉపయోగం ఏమి లేదు. అదే నిదానంగా, మలుపులు ఎన్నున్నప్పటికీ అంతిమంగా ఆదర్శాలకి సముచితమయిన స్థానం ఇచ్చే మార్గమే ఎప్పటికైనా జీవన వికాస నిర్మాణానికి, బతుకుబాటని ఉన్నతంగా మల్చుకోడానికీ సహాయం చేయగలుగుతుంది. నా ఉద్దేశం ప్రకారం తిన్నగా లేనప్పటికీ నెమ్మదైన నిదానమైన మార్గాలే మేలయినవి కానీ, షార్ట్‌కట్‌లుగా పిలవబడే అడ్డదారులు కాదు. అడ్డదారులనేవి జీవితంలో ఎల్లప్పుడూ ప్రమాదకరం, చాలా ప్రమాదకరం.

సరే, ఇప్పుడు విషయంలోకి వద్దాం. కమ్యూనిస్టు సిద్ధాంతం ఏంటి? అది ఎలా మొదలైంది? లోకంలో దోపిడీ ఉందని కమ్యూనిస్టు సిద్ధాంతం చెబుతుంది.

ప్రపంచమంతా ఉన్న పేదలు ధనికుల చేత దోపిడీకి గురౌతారు. ఆస్థిపాస్తుల్ని తమ గుప్పిట్లో పెట్టుకున్న ధనికులు ప్రజల్ని బానిసలుగా చేస్తారు. దుఃఖానికి, బాధలకి, బీదరికానికీ ఇదే కారణం. ఈ ప్రస్తావనలతోనే కార్ల్‌మార్క్స్ ప్రారంభించాడు. 'దోపిడీ' అనే పదాన్ని ఉపయోగించాడు. మరి దీనికి పరిష్కారంగా కార్ల్‌మార్క్స్ ఏం చెప్పాడు? పేదరిక నిర్మూలనకీ, దుఃఖ నివారణకీ వ్యక్తిగత ఆస్తిని రద్దు చేయడం అవసరమని కార్ల్‌మార్క్స్ పరిష్కారంగా చెబుతాడు. వ్యక్తిగత ఆస్తివల్ల చిక్కులున్నాయి కాబట్టీ ఎవరికీ ఆస్తి ఉండరాదు. కార్ల్‌మార్క్స్ భాషలో చెప్పాలంటే, శ్రామికుడు చేసిన ఉత్పత్తి నుండి అదనపు విలువ వస్తుంది. అయితే, అది ఆ శ్రామికుడికి దక్కదు. దానిని యజమాని తీసుకుంటాడు. శ్రామికుల శ్రమ ఫలితమయిన అదనపు విలువని యజమాని ఏ విధంగా స్వప్రయోజనం కొరకు తీసుకోగలడు? అనేది కార్ల్‌మార్క్స్ ప్రశ్న. దానికి జవాబు రాజ్యమే ఏకైక యజమానిగా ఉండటం. అందుకోసమే కార్ల్‌మార్క్స్ కార్మికవర్గ నియంతృత్వ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఈ మూడో ప్రతిపాదనని మార్క్స్ వివరించాడు. పీడిత వర్గ పాలన ఉండాలే కానీ పీడకవర్గ పాలన కాదనీ, అందుకోసమే కార్మికవర్గ నియంతృత్వం అంటాడు. ఇవీ కార్ల్‌మార్క్స్ యొక్క ప్రాథమిక ప్రతిపాదనలు, రష్యాలోని కమ్యూనిజానికి ఇదే ఆధారం. నిస్సందేహంగా వీటిని విస్తరించుకుని మార్పులూ, చేర్పులూ చాలానే చేసుంటారు. కానీ మౌలిక ప్రతిపాదనలయితే ఇవే.

ఇప్పుడు బౌద్ధంలోకి వచ్చి కార్ల్‌మార్క్స్ లేవనెత్తిన వాటిని గురించి బుద్ధుడు ఏం చెప్పాడో చూద్దాం. నేను ముందే చెప్పినట్లు మార్క్స్ తన మార్గాన్ని పేదల దోపిడీ దగ్గర ప్రారంభించాడు. మరి బుద్ధుడు ఏం చెప్పాడు? బుద్ధుడెలా ఎక్కడ్నుంచి ప్రారంభించాడు? అతడు చేపట్టిన మత నిర్మాణానికి పునాది ఏది? 2000 లేదా 2400 ఏళ్ళ క్రితం బుద్ధుడు కూడా సరిగ్గా ఇదే చెప్పాడు. లోకంలో దుఃఖం ఉందన్నాడు. దోపిడీ అనే పదాన్ని ఆయన వాడలేదు కానీ, దుఃఖం అనే భావన మీదనే తన మతానికి పునాదులు వేసాడు. ప్రపంచంలో 'దుఃఖం' ఉంది. దుఃఖం అనే పదాన్ని అనేక రకాలుగా వ్యాఖ్యానించవచ్చునడంలో సందేహం ఏం లేదు. జీవన చక్రంలో పునర్జన్మని కూడా దుఃఖంతో పోలుస్తారు, నేను దానిని అంగీకరించను. బుద్ధుడు బీదరికానికి పర్యాయంగా దుఃఖమనే మాటని వాడినట్లు బౌద్ధ సాహిత్యంలో అనేకచోట్ల మనకి కనిపిస్తుంది. అందువల్ల మౌలికమయిన పునాది విషయంలో రెంటికీ నిజంగా విబేధం ఏమీ లేదు.

పునాది కోసం బౌద్ధులు కార్ల్‌మార్క్స్ వద్దకి వెళ్ళడం అనవశరం. బలంగా వేయబడిన పునాది ఇక్కడ ఉంది. ఎక్కడయితే బుద్ధుడు తన మొట్టమొదటి ఉపన్యాసం, ధర్మచక్ర ప్రవర్తన సుత్త ఇచ్చాడో అందులోనే ఉంది. కాబట్టి, కార్ల్‌మార్క్స్‌వైపు ఆకర్షింపబడేవారికి నేను చెప్పేదేమంటే, ధర్మచక్ర ప్రవర్తన సుత్తని అధ్యయనం చేసి అందులో బుద్ధుడు చెప్పిందాన్ని అర్థం చేసుకోండి. అప్పుడు మీ ఈ ప్రశ్నకి సంతృప్తికరమైన సమాధానం దొరుకుతుంది. బుద్ధుడు తన మత పునాదిని ఆత్మ పరమాత్మల మీదో, అతీతశక్తుల మీదో వేయలేదు, అందుకు బదులుగా వ్యదార్థ జీవుల యథార్థ జీవన చిత్రంపై వేసాడు, ప్రజలు బాధల్లో బతుకుతున్నారు. కాబట్టి మార్క్సిజం లేదా కమ్యూనిజానికి సంబంధించి చెప్పాల్సి వస్తే బౌద్ధంలోనే ఇందుకు సరిపోయేంత వివరణ ఉంది. పైగా ఇది బుద్ధుడు మార్క్స్ పుట్టడానికి 2000 సంవత్సరాల ముందుగానే చెప్పాడు.

ఆస్తికి సంబంధించి కూడా బౌద్ధం, కమ్యూనిజాల మధ్య చాలా దగ్గరి పోలిక కనిపిస్తుంది. దోపిడీ నిర్మూలనకి రాజ్యం ఉత్పత్తి సాధనాల్ని అంటే ఆస్తుల్ని స్వాధీనం చేసుకోవాలని కార్ల్‌మార్క్స్ చెప్పాడు. భూమి, పరిశ్రమలు అన్నీ ప్రభుత్వం చేతిలోనే ఉండాలి. అప్పుడిక ఏ వ్యక్తీ శ్రామికుల శ్రమ ద్వారా లాభాలు పొంది వారిని దోచుకునేందుకు వీలుండదని మార్క్స్ చెప్పాడు.

ఇప్పుడు బౌద్ధ సంఘంలో బుద్ధుడు భిక్కువుల జీవన విధానం కోసం చెప్పిన నియమాలని పరిశీలిద్దాం. బుద్ధుడు ఏ పునాది ఆధారంగా తన నియమాల్ని ఏర్పరిచాడు? ఏ బిక్కువుకీ వ్యక్తిగత ఆస్తి ఉండరాదని బుద్ధుడు అన్నాడు. నిజం చెప్పాలంటే, ఏ బౌద్ధ భిక్షువుకీ ఆస్తి ఉండరాదు. అయినప్పటికీ అక్కడక్కడా ఇందులో చిన్న చిన్న లోపాలు కనబడతాయి. కొన్ని దేశాల్లో భిక్షువులకు ఆస్తిపాస్తులుండడం కూడా నేను గమనించాను. కానీ, ఎక్కువ మొత్తంలో భిక్షువులెవరికీ అసలు ఆస్తనేది లేదు. ఇంకా చెప్పాలంటే, బౌద్ధ సంఘం యొక్క నియమాలు రష్యాలోని కమ్యూనిస్టు నియమాలకంటే కూడా కఠినమైనవి. ఇప్పటిదాకా ఎవరూ చర్చించి ఒక కొలిక్కిరాని అంశాన్ని నేను తీసుకున్నాను.

సంఘాన్ని ఏర్పరచడంలో బుద్ధుని ఉద్దేశం ఏమిటి? ఆయన ఎందుకది చేసాడు? కొద్దిగా చరిత్రలోకి వెళితే బుద్ధుడు తన మత ప్రచారం కావిస్తున్న కాలం,

మనం ‘పరివ్రాజకులు’ అని ఎవర్నయితే పిలుస్తున్నామో వారు బుద్ధుడి కంటే చాలాకాలం ముందు నుంచే ఉన్నారు. ‘పరివ్రాజకులు’ అంటే విస్థాపనకి గురయినవాళ్ళు అని అర్థం. ఎవరైతే వారి నివాస స్థలాలు, ఇళ్ళు, వాకిల్ళు కోల్పోయారో వారంతా పరివ్రాజకులు. బహుశా ఆర్యుల కాలంలో భిన్న ఆర్య తెగల మధ్య యుద్ధాలు జరిగేవి. కొన్ని తెగలు వోడిపోయి, తమకున్న నివాస స్థలాల్ని కోల్పోయి సంచారులయ్యేవారు. వారినే ‘పరివ్రాజకుల’నేవారు. ఇలా దేశదిమ్మరులుగా సర్వం కోల్పోయి తిరుగుతున్న వారందర్నీ చేరదీసి ఒక నిర్మాణంగా ఏర్పరచడం బుద్ధుడు చేసిన మహత్తర కార్యం. ఇలా సంఘంగా ఏర్పడిన పరివ్రాజకుల జీవన విధానాలకి గాను రూపొందించబడ్డ, ‘వినయ పిటకం’లో ని నియమానుసారం ఏ బిక్కువుకీ కూడా సొంతాస్థి ఉండటం అనేది అంగీకరించబడదు. బిక్కువు వద్ద కేవలం ఏడు వస్తువులు ఉండేందుకే అనుమతి ఇవ్వబడింది; వెంట్రుకలు తీసుకునే కత్తి, నీటి కోసం చెంబు, భిక్షాపాత్ర, మూడు దీక్షా వస్త్రాలు, అవి చినిగిపోతే కట్టుకుందుకు ఒక సూది. కమ్యూనిస్టు సిద్ధాంతసారం వ్యక్తిగత ఆస్తిని నివారించడమే అయితే, వినయపిటకంలోని కఠినమయిన భిక్కు నియమాలకంటే ఉన్నతమయినవి ఎక్కడయినా ఉంటాయా? నేను తెల్సుకోవాలనుకుంటున్నాను, నాకైతే ఎక్కడా కనిపించలేదు మరి. కాబట్టి, కమ్యూనిజంలోని వ్యక్తిగత ఆస్తిరద్దనే నియమం పట్ల ఆకర్షితులయిన జనులు, యువత ఎవరైనా ఉంటే, ఆ నియమం ఇక్కడా ఉంది. ఐతే, ఏ పరిమాణంలో ఈ వ్యక్తిగత ఆస్తి నివారణ అనే నియమం వ్యవస్థకి వర్తిస్తుందనేది, ఆయా మొత్తం సమాజ స్వరూపం యొక్క స్థితిగతులు, నిర్మాణం, అభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది. సిద్ధాంతానికి సంబంధించినంతవరకూ వ్యక్తిగత ఆస్తి రద్దు విషయములో ఏవైనా పొరపాట్లు, తప్పులు ఉన్నప్పటికీ బౌద్ధం సంఘానికి కట్టుబడి ఉంటుంది. కానీ ఇంకెవరి పక్షాన నిలవదు.

ఇప్పుడు మరొక అంశం దగ్గరికొద్దాం. కార్ల్‌మార్క్స్ లేదా కమ్యూనిస్టులు కమ్యూనిజం కోసం అనుసరించే మార్గాలు పాటించే ప్రక్రియలు ఏమిటి? ఇదో ముఖ్యమయిన ప్రశ్న. కమ్యూనిస్టు సమాజం కోసం కమ్యూనిస్టులు అనుసరించే మార్గం విరోధుల్ని చంపే హింసా మార్గం. ఇక్కడే బుద్ధుడికీ – కార్ల్‌మార్క్స్‌కీ మౌలికమయిన వ్యత్యాసం ఉంది. బుద్ధుడు ప్రజల్ని ఒప్పించి, నైతిక ఆదర్శాలతో, ఆచరణలతో సిద్ధాంతాన్ని ప్రేమ ద్వారా సమ్మతింపజేసేవాడు. విరోధిలో సైతం

భావజాలపరమైన ప్రేరణ కలిగించీ ప్రేమతో పోరాడాలే కానీ ఆధిపత్యంతో, అధికార బలంతో కాదనేది బుద్ధుని మార్గం. ఇక్కడే ఈ రెండు సిద్ధాంతాలకీ మౌలికమయిన వ్యత్యాసం ఉంది. బుద్ధుడు హింసని అంగీకరించడు, కమ్యూనిస్టులు అంగీకరిస్తారు. అందువల్ల కమ్యూనిస్టులకు త్వరితగతిన ఫలితాలు కనిపిస్తాయనడంలో సందేహమేం లేదు; ఎందుకంటే మనుషుల్ని నిర్మూలించే మార్గంలో ఇక వ్యతిరేకించడానికి మనుషులెవరూ మిగలరు.

మీరు మీ సిద్ధాంతంతో దానికి సంబంధించిన కార్యాచరణతో ముందు కెళ్ళొచ్చు. కానీ, నేను ముందే చెప్పినట్లు బుద్ధుని మార్గం మాత్రం సుదీర్ఘమైంది, కొందరన్నట్లు బహు కష్టమైందీ, దుర్భరమైందని కూడా చెప్పవచ్చు. కానీ, ఇదే సరయిన, కచ్చితమయిని మార్గం అనడంలో నాకు ఎటువంటి అనుమానమూ లేదు.

నేనెప్పుడూ నా కమ్యూనిస్టు మిత్రుల్ని అడిగే రెండు మూడు ప్రశ్నలున్నాయి. వాటికి వారెన్నడూ జవాబు చెప్పలేదు. హింసాయుతమైన మార్గం ద్వారా వారు కార్మికవర్గ నియంతృత్వం అనేదాన్ని స్థాపిస్తారు. ఆస్తిపాస్తులున్నవారి హక్కుల్ని తొలగించి ఆస్తుల్ని స్వాధీనం చేసుకుంటారు. వారికిక చట్టసభల్లో ప్రాతినిధ్యం ఉండదు, వోటు హక్కుండదు, వారిక రెండో తరగతి పౌరులుగానే పరిగణించబడతారు. ఐతే, నేను వాళ్ళని "ప్రజల్ని పాలించడానికి నియంతృత్వం సరైనదని మీరు అనుకుంటున్నారా?" అనడిగితే, వారు, కాదు, మేం నియంతృత్వాన్ని ఒప్పుకోం" అంటూ, "ఇది తాత్కాలికంగా కొంత కాలమే ఉంటుంది" అని చెబుతారు. అప్పుడు మనం కనక, "కొంతకాలం అంటే ఎంత కాలం? ఇరవై ఏళ్ళా? నలభై ఏళ్ళా? యాభై ఏళ్ళా?" అని అడిగామనుకోండి, సమాధానం ఉండదు. శ్రామికవర్గ నియంతృత్వం కాలక్రమంలో దానికదే ఎలాగోలా అదృశ్యం ఐపోతుందనే జవాబు మాత్రమే చెబుతుంటారు.

సరే, బాగుంది, అలాగే ఆ నియంతృత్వం మాయమైపోతుందనుకుందాం. మరప్పుడు, "అది పోయాక ఏం జరుగుతుంది? దాని స్థానాన్ని ఏది భర్తీ చేస్తుంది? మనుషులకి ఏదో రకమైన ప్రభుత్వం అవసరం లేదా?" వాళ్ళ దగ్గర సమాధానాలు లేవు.

మనం ఇప్పుడు బుద్ధుడి దగ్గరకెళ్ళి ఇవే ప్రశ్నల్ని బౌద్ధధమ్మానికి ముడిపెట్టి అడుగుదాం. అప్పుడు ఆయన ఏమంటాడు? మనిషి మనస్సు, లోక స్వభావం

మారకుండా మనుషుల్లో, సమాజంలో మార్పు సాధ్యం కాదనే అత్యున్నతమైన ఆదర్శాన్ని బుద్ధుడు ప్రపంచానికి చాటాడు. కాన, ఎంత గొప్ప సంస్కరణ ఐనా అది మొదలవ్వాల్సింది మొదట మన మనసులోనే అనే నిజాన్ని బౌద్ధం లోకానికి చాటింది. మనసు కనుక కమ్యూనిస్టు విధానాన్ని అంగీకరించి, దానినే ప్రేమగా, శాశ్వతంగా కొనసాగించడానికి సిద్ధపడ్డట్లయితే అందుకు సైనికులు, పోలీసుల అవసరమే లేదు. ఎందుకు? సమాధానం ఒకటే: బుద్ధుడు నీ అంతరాత్మని ఎంత శక్తివంతం చేసాడంటే, నువ్వనుకున్న మార్గంలో కొనసాగడానికి గాను దానికదే కాపలాదారునిగా మనస్సాక్షి వ్యవహరించగలదు. మార్గం శాశ్వతమైందైనప్పుడు మానసిక మార్పులతో ఇబ్బంది లేదు.

కమ్యూనిస్టు విధానం బలప్రయోగం మీద ఆధారపడింది. ఇప్పటికే వోటమి ఛాయలు కనిపిస్తున్న రష్యాలో కమ్యూనిస్టు నియంతృత్వం కనక పతనమైతే ఏం జరుగుతుంది? కమ్యూనిస్టు వ్యవస్థకి ఏమౌతుందో తెల్సుకోవాలని నాకు నిజంగా ఆసక్తి ఉంది. రష్యన్ ప్రజల మధ్య ప్రభుత్వాస్తులు, అధికారం కోసం రక్తపాతం జరుగుతుందా? ఆ పరిణామం అక్కడికే దారి తీస్తుందా? ఎందుకు? ఎందుకంటే వాళ్ళు కమ్యూనిస్టు వ్యవస్థని స్వచ్ఛందంగా అంగీకరించిన వాళ్ళు కాదు. ఉరితీస్తారనే భయంతో విధేయులుగా బతుకుతున్నారంతే. ఇలాంటి వ్యవస్థ ఎక్కువ కాలం నిలవదు. కమ్యూనిస్టులు ఈ ప్రశ్నలకి జవాబు చెప్పకపోతే, ఇక వారి వ్యవస్థ పరిస్థితి ఏంటి? బలమనేది పోతే ఇక దాన్ని వాడటం వల్ల ప్రయోజనం లేదు. మార్పనేది మనసులో రాకపోతే, బలప్రయోగం ఎల్లప్పుడూ అవసరంగానే ఉంటుంది. చివరగా నేను చెప్పదల్చుకున్నది ఏంటంటే, ప్రజాస్వామిక విధానం అనేది బౌద్ధంలో నాకు కనబడిన అత్యున్నత ఆదర్శం. అజాతశత్రువు మంత్రి వజ్జిరాజులపై యుద్ధానికి వెళ్ళినపుడు బుద్ధుడు, 'ఎంతవరకైతే వారు తమ ప్రాచీన పద్ధతుల్ని పాటిస్తుంటారో అప్పటిదాకా వారికి ఏమికాదు' అంటాడు. ఏదో తెలీని కారణం వల్ల బుద్ధుడు తన ఉద్దేశమేంటో స్పష్టంగా వివరించలేదు. కానీ వజ్జరాజ్యం అవలంభిస్తున్న గణతంత్ర ప్రజాస్వామ్యబద్ధమైన పద్ధతుల గురించే ఆ ప్రస్తావన అనేది నిస్సందేహం. 'ఎంతకాలం వజ్జులు వారి విధానాన్ని అనుసరిస్తారో అంతకాలం వారు అజేయులు' అంటాడు. బుద్ధుడు విశిష్టమయిన ప్రజాతంత్రవాది.

కాబట్టి నేను చెప్పదల్చుకున్నది ఏమంటే, నేను రాజనీతి శాస్త్ర విద్యార్థిని, ఆర్థికశాస్త్ర విద్యార్థిని ఇంకా బోధకుడ్ని. చాలాకాలం కార్ల్‌మార్క్స్‌నీ, కమ్యూనిజాన్నీ అధ్యయనం చేయడానికి వెచ్చించాను. బౌద్ధ ధమ్మాన్ని కూడా కాలాన్ని సద్వినియోగం చేసుకుని అధ్యయనం చేసానని గౌరవనీయ సభాధ్యక్షులవారికి తెలియజేస్తున్నాను.

ఈ రెండు మార్గాల్నీ సరిపోల్చి చూసిన తర్వాత నేనొచ్చిన నిర్ణయం ఏంటంటే, బుద్ధుని ప్రకారం లోకంలోని గొప్ప సమస్య దుఃఖం. అది నివారించడానికి బుద్ధుని మార్గమే సక్రమమయిందీ, సురక్షితమైందీ.

ఈ విధంగా బౌద్ధ దేశాల్లోని యువజనం, వారు నిజమయిన బోధనల్ని తెల్సుకోవడంపై మరింత శ్రద్ధ పెట్టాల్సి ఉందని నేననుకుంటున్నాను.

చివర్లో మరో విషయం నేను చెప్పాలనుకుంటున్నాను. బౌద్ధ దేశాల్లో ధర్మానికి ఏదైనా ప్రమాదం వచ్చిందంటే దానికి కారణం భిక్షువులే. ఎందుకనంటే, వారు తమపై ఉన్న ధమ్మబోధన, ప్రచార బాధ్యతని నిర్వర్తించడం లేదనేది నా వ్యక్తిగత అభిప్రాయం. అసలు ప్రబోధం ఎక్కడుంది? భిక్షువు తన మానాన తాను జీవిస్తున్నాడు, పూటకింత మాత్రమే తింటూండవచ్చు: బహుశా ఏదో కొంత చదూతూండవచ్చు, ఎక్కువగా పడుకుని ఉండటం కూడా నాకు తెలుసు, ఇంకా, సాయంకాలాలు చిన్న తరహా వాయిద్యాన్నీ, సంగీతాన్నీ వింటూండవచ్చు. కానీ, మతాన్ని ప్రచారం చేసే మార్గం మాత్రం ఇది కాదు.

మిత్రులారా, నేనెవర్నీ విమర్శించడం లేదు,కానీ సమాజాన్ని పునర్నిర్మాణం చేసే నైతిక శక్తిగా మతాన్ని మార్చాలంటే మాత్రం దానిని నిరంతరం పదేపదే ప్రజల చెవుల్లోకి చేర్చగలగాలి. పిల్లల్ని మనం ఎంతకాలం పాఠశాలకి పంపుతాం? ఒక్కరోజు బడికి పంపి, మానిపించేస్తే పిల్లలకి చదువొచ్చేసి విద్యావంతులు అయిపోతారా? పిల్లలు ప్రతీరోజూ బడికెళ్ళాలి, కనీసం ఐదారుగంటలు ఏకాగ్రతగా కూర్చుని చదువుకోవాలి. అప్పుడు మాత్రమే పిల్లలకి సంతృప్తికరమైన స్థాయిలో విద్యా, జ్ఞానం వస్తాయి. బౌద్ధారామం ప్రభుత్వం కాదు. ప్రజల్ని ఆరామాలకి ఆహ్వానించి ఏదో నిర్దిష్టమయిన నైతిక విద్యని గురించో, మరో అంశం గురించో బిక్కువులు ప్రసంగించడం ఇప్పటివరకూ నేనెన్నడూ చూడలేదు.

నేను శ్రీలంకలో బిక్కువుల ప్రసంగం చూడాలని వుందని ఉత్సాహంగా అడిగాను. అప్పుడు వాళ్ళు పదకొండింటికి నన్నో ప్రదేశానికి తీసికెళ్ళారు. చతురాకారపు చిన్న ఖాళీస్థలంలో కిందన మేం కూర్చోగా ఎదురుగా బల్ల ఒకటుంది. కొంతసేపటికి ఒక బిక్కువుని తీసుకుని వచ్చారు. ఇంతలో చాలామంది స్త్రీ పురుషులంతా నీళ్ళతో ఆ బిక్కువు కాళ్ళని కడగడం మొదలెట్టారు. అదయ్యాక అతడొచ్చి బల్లమీద ఆసీనుడయ్యాడు, వెంట ఒక విసనకర్ర కూడా ఉంది. సింహళ భాషలో అతడో రెండు నిమిషాలు ప్రసంగించాడు. అదేంటో ఆ దేవుడికే తెలియాలి. తర్వాత ఆయన వెళ్ళిపోయాడు.

మీరు కనుక క్రైస్తవ చర్చికెళితే అక్కడ ఏం జరుగుతుంది? ప్రతీవారం అక్కడ జనాలు కూటమిగా ఏర్పడి కలుస్తారు. వాళ్ళు ప్రార్థనలు చేస్తారు. అక్కడి మత బోధకులు, బైబిల్లోని ఏదోక అంశాన్ని ఆధారం చేసుకుని ఏసుప్రభువు ఏం చెప్పాడో ప్రజలకి వాక్యాల్ని గుర్తుచేస్తూ, ఒక క్రమానుసారం ప్రసంగాలు చేస్తారు. తొంభైశాతం క్రైస్తవమంతా రూపంలోనూ, సారంలోనూ బౌద్ధాన్ని నకలుగా అనుసరించిందేనంటే మీ అందరికీ ఆశ్చర్యం కలుగుతుంది. రోమ్‌లోని ప్రధానమయిన చర్చికి వెళ్ళి మీరు కనుక చూస్తే, మీకది బారుత్‌లోని 'విశ్వకర్మ' ఆరామాన్ని గుర్తుకు తెస్తుంది.

విషభ్ని అనబడే చైనా రాయబారి బౌద్ధం గురించి రాసిన పుస్తకంలో, బౌద్ధానికి, క్రైస్తవానికి గల సారూప్యాలు చూసి ఆశ్చర్యంతో విస్తుపోయినట్లు రాసుకున్నాడు. బౌద్ధం క్రైస్తవాన్ని అనుసరించిందనే ధైర్యం అతడు చేయలేదు కానీ క్రైస్తవులు బౌద్ధాన్ని అనుకరించినట్లు కూడా అతనొప్పుకోలేదు. దీని గురించి చెప్పాలంటే చాలా ఉంది కానీ కాలాతీతం అవుతోంది. ఇప్పుడు బౌద్ధుల మధ్యన మన మత ప్రచారం కోసం కూడా క్రైస్తవుల నుండి కొన్ని పద్ధతుల్ని మనం స్వీకరించాలి. ప్రతీరోజూ, అన్ని వేళలా బౌద్ధధమ్మం వాళ్ళకోసం నిల్చి ఉందనే స్పృహ రావాలి, పోలీసు వ్యవస్థ వంటి ధర్మం ఉండగా తప్పుదారిలో వెళ్ళే ఆలోచనే ఎవరికీ రాకూడదు. అలా కాని ఎడల ఈ మతం ఎప్పటికీ క్షీణదశలోనే మిగిలిపోతుంది. కొన్ని బౌద్ధ దేశాల్లో కూడా ఇది శిథిలావస్థకి చేరినట్లు నేను చూసాను. కానీ, దీని ప్రభావం మాత్రం ఇంకా నిలిచి ఉందనేది నిస్సందేహం.

నేను బర్మాలో ఉండగా చూసిన ఒక ఉదంతం మీతో చెప్పాలనుకుంటున్నాను. నేనొక సమావేశానికని బర్మా వెళ్ళాను. అప్పుడు నన్ను వాళ్ళు పునర్నిర్మాణం చేస్తున్న

గ్రామాల్ని చూపించడానికని తీసుకెళ్లారు. నాకు చాలా సంతోషమేసింది. ఆ పునర్నిర్మాణ బృందం గ్రామాభివృద్ధికోసం నడుం కట్టింది. వీధులన్నీ వొంకరటింకరగా ఏ ప్రణాళికా లేకుండా వున్నాయి. ప్రణాళికా బృందం ఇనుప స్తంభాలు నాటి వాటికి తాళ్ళుకట్టి ఏ వీధెటు పోతుందో తెలిసేలా చేసింది. చాలాచోట్ల వారేసిన సంజ్ఞాగీతలు కొన్ని సొంతిళ్ళలోంచీ, కొన్ని వ్యక్తిగత స్థలాల గుండా పోవడం నేను గమనించాను. నేనప్పుడు 'దీనికి వాళ్ళెలా సమ్మతించారు? ఆయా భాగాలకి గాను మీరు డబ్బులు చెల్లిస్తారా?' అనడిగాను. అప్పుడు వాళ్ళు నాతో, "ఎవ్వరికీ డబ్బు అక్కర్లేదు, మీకిది కావాలంటే తీసుకోవచ్చు" అని అందరూ అన్నారు. మన దేశంలో భూమి విషయంలో చిన్న చెక్క కోసం కూడా రక్తం ఏరులై పారుతుంది. పరిహారం చెల్లించకుండా నేల దక్కదు. కానీ అక్కడలా లేదు ఎందువల్ల? ఎందుకు బర్మా దేశస్తులు వారి ఆస్తిపాస్తుల విషయంలో చాలా స్వేచ్ఛగా, స్వతంత్రంగా వ్యవహరించగలుగుతున్నారు? వాళ్ళసలు ఎందుకు ఆస్తిపాస్తులకి ప్రాముఖ్యత ఇవ్వడం లేదు? ఎందుకనంటే బుద్ధుడు చెప్పిన "సర్వం అనిత్యం" అనే బోధనని సరిగా అర్థం చేసుకున్నారు కాబట్టి, కనిపించేది అంతా అశాశ్వతమనే సత్యాన్ని తెలుసుకున్నారు కాబట్టే, అశాశ్వతమయినవాటికోసం పోట్లాట ఎందుకు? మీకా భూమి కావాలా, మంచిదే, ఐతే తీసుకోండి, అనగలుగుతున్నారు.

కాబట్టి పెద్దమనుషులారా, నేనిక ప్రసంగాన్ని కొనసాగించాలనుకోవట్లేదు, ఇంతకు మించి అవసరం కూడా లేదు.

ఈ విషయానికి సంబంధించీ నా దృక్పథాన్ని మీతో పంచుకోవాలనుకున్నాను. కమ్యూనిస్టు విజయాల్ని చూసి ఆకర్షించబడకండి. మనం పదిశాతం మందిమైనా బుద్ధుడంత చైతన్యవంతం ఐతే కనుక, అవే విజయఫలాల్ని ప్రేమ, ధర్మం, మంచి మనస్సులతో సాధించి తీరతామనే విశ్వాసం నాకు ఉంది. ధన్యవాదాలు.

✧ ✧ ✧ ✧ ✧

- *Report of the 4th World Buddhist Conference of The World Fellowship of Buddists–15–21 Nov.1956, The Dharmodaya Sabha, Kathmandu, Nepal.*

# ముగింపు కాదు, ముందడుగు!

డి.సి. అహిర్ 'భారతదేశంలో బౌద్ధం ఎలా? ఎందుకు? పతనం అయింద'నే పుస్తకం పరిచయంలోనే, ప్రాచీన కాలంలో మానవీయమయిన పరిమళాలతో దేశమంతటా శతాబ్దాలపాటు గుభాళించిన బౌద్ధ వైభవాన్ని రాహుల్ సాంకృత్యాయన్ మహాపండితుడి మాటలతోనే మొదలెడతాడు. ఈ దేశంలో బౌద్ధానిది అసహజ మరణమేననీ, ఇంకా చెప్పాలంటే అది పథకం ప్రకారం జరిగిన హత్యకి ఏమి తీసిపోదనే విషయం కూడా అధ్యయనపరులకి తేలిగ్గానే అర్థం అవుతుంది.[1]

"భారతదేశ చరిత్రకి సంబంధించినంత వరకూ స్వర్ణయుగం అనేది ఏదయినా ఉంటే, అది ఈ నేలమీద బౌద్ధం విలసిల్లిన కాలమే" అంటాడు మహామానవవాద తత్త్వవేత్త మానవేంద్రరాయ్ 'భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనం' అనే తన రచనలో. కొన్ని శతాబ్దాలపాటు అవిచ్ఛిన్నంగా ఈ దేశంలో కొనసాగిన బౌద్ధయుగమే నిజమయిన అత్యున్నత భౌతిక – నైతిక సంస్కృతికి తిరుగులేని సాధనమని రాయ్ అభిప్రాయం. అనేకమంది బుద్ధిజీవులది కూడా ఇదే భావం.[2]

---

1. How and why Buddhism Declined in India, D.C. Ahir, Published by Blumoon Books, New Delhi, 1996. ఈ పుస్తక ప్రారంభమే రాహుల్ సాంకృత్యాయన్ మాటల్ని ఉల్లేఖించిన రచయిత పరిచయంలోనే "In our opinion, Buddhism in India died an unnatural death and the Reasons, which led to its disappearance from the land of its birth were external rather than internal" (p-6) అంటాడు.

2. Humanism, Revivalism and the Indian Heritage, by M.N. Roy, Renaissance Publishers Pvt. Ltd, Culcutta, 1999. ఇందులోని మొట్టమొదటి వ్యాసం 'Indian Renaissance' లోనే "That very significant evolution of thought, out of the background the vedic religion and Upanishadic metaphysical speculation, in the fullness of time, ushered in the Golden Age of India, if there ever was one that is, the Buddhist Period." అన్న రాయ్, "... it was during the sevral centrueis of the Buddhist era that India really attained a very high level of material and moral Culture." (p-16,17) అంటాడు.

ఇంతకీ ఇప్పుడు బౌద్ధం గురించీ, బౌద్ధ పతనం గురించీ ఈ అకస్మాత్తు చర్చ ఎందుకు? అవసరమైన చర్చే కాని అకస్మాత్తుగా తలకెత్తుకుంది కాదు. ఆ మాటకొస్తే అడపాదడపా అనేక సందర్భాల్లో భావోద్యమాలకి వెన్నుదన్నుగా బౌద్ధ ప్రచారాన్ని నా వంతు ప్రయత్నంగా దాదాపు దశాబ్దకాలం నుండి నిబద్ధతగా చేస్తూనే వస్తున్నాను. కొద్దిమంది శుద్ధ భౌతికవాద మిత్రులు కూడా అప్పుడప్పుడు ఇందుకు గాను నన్ను అపార్థం చేసుకున్న సందర్భాలు కూడా లేకపోలేదు.

నిజానికి నాస్తికవాద తత్త్వవేత్త పెరియార్. ఇ.వి. రామసామి అన్నట్లు ఈ దేశంలోని భావోద్యమాలు అన్నీ బౌద్ధాన్ని సముచితంగా గౌరవించినట్లయితే, బౌద్ధం ఆధునిక భారతదేశ చరిత్రలో సైతం అత్యున్నతంగా వెలుగొందేది. అయితే, శుద్ధ నాస్తికత, యాంత్రిక భౌతికవాదం వెరసి కొత్త తరహా ఉత్త పరాయీకరణకి దారితీసి మానవోద్యమాలన్నింటిని మసిపూసి మారేడుకాయ చేసాయి. ఫలితంగా హేతు బద్ధమయిన చింతనాత్మకతతో కూడిన భారతీయ భావోద్యమాలకి కూడా చాందసం రంగును పులిమి చేతులు కాల్చుకున్న చరిత్ర కనబడుతుంది.[3]

ఇదో వింత సమస్య, ఈ దేశంలో అణగారిన ప్రజల పక్షాన నిలిచే గొంతులన్నింటినీ మెలిపెడుతున్న గుండె చింత. వైజ్ఞానిక సమాజానికి సరిగ్గా సరిపోయే బౌద్ధం గురించిన ఆరోగ్యకరమయిన సంవాదాలకి స్థలమే లేకపోగా, మరోవైపు అక్కర్లేని సిద్ధాంత రాద్ధాంతాల కోసం జీవిత కాలాలపాటు చీలికపీలికలైన మేధోజీవులు చికాకు లేకుండా అక్కర్లేని చర్చలు చేయడం ఇక్కడొక్కచోటే మనం చూడగలిగే చేదు నిజం, తెలుగులో జరుగుతున్న తాత్విక దౌర్భాగ్యానికి తిరుగులేని సంకేతం.[4]

---

3. చూడు; Buddhism, Periyar E.V. Ramasamy Published by : Dravidar Kazhagam, Chennai, 2003 ఇందులో "Buddhas Philosophy, his tenets, and his sermons stand by our self respect and Rationalist movements" అన్న పెరియార్, "Buddhas teachings and Principles are of tremendous value to us for our revolutionary purposes." (p-14) అంటాడు.

4. జర్మనీలో జన్మించి శ్రీలంకలో ఉంటున్న న్యానపోనికా బిక్కు రచన 'Buddhism and the God idea' లో దీనికి సంబంధించి జరిగిన చర్చను Is Buddhism Atheism? అనే

సంవేదనాత్మక చింతన ఆస్తిక – నాస్తిక విచికిత్సకి విరుద్ధమనేది నా అభిప్రాయం. మనిషనే సంక్లిష్టమయిన పదార్థానికి వివిధ వికారాలు ఉన్నాయి. అనేక అంతర్మథనాలు ఉన్నాయి. వాటన్నింటినీ ఎప్పటికప్పుడు ఎరుకతో తేలిక పరుచుకుంటూ అస్తిత్వాన్ని చైతన్యవంతంగా ఆస్వాదించగలగడమే అర్థవంతమయిన జీవితానికి చుక్కాని. అయితే, అందుకు మతమనే మార్గం అవసరమా కాదా అనేది ఆయా వ్యవస్థల పరిణితి, పరిణామంపై ఆధారపడి ఉంటుంది. విభిన్న దశల్లోకి ప్రవహించే మానవాళి మార్గాలు భవిష్యత్తులో మతాన్ని అంగీకరించి పాటించాలనే తప్పనిసరి నియమం ఏదీ లేదు.

కానీ, మనిషి నియమబద్ధమయిన నిశ్చల జీవనయానాన్ని బుద్ధితో కట్టడి చేసే నిర్దిష్టమయిన ఒక మార్గాన్ని, నిర్మాణాత్మక గమనంగా స్వచ్ఛందంగా స్వీకరించదల్చుకుంటే కనుక, అందుకు బౌద్ధాన్ని మించినది లేదనేది నా అభిప్రాయం. అందుకే, అత్యంత పరిమితమయిన నా కార్యాచరణకి అల్పమయిన నా వంతు ప్రచారోద్యమంగా రచనా వ్యాసంగ, ప్రసంగ, ప్రచురణలకి గాను శక్తిమేరకు ప్రయత్నం చేస్తున్నాను. అందులో భాగమే ఈ కృతులు. అభిప్రాయబేధాలు ఉన్నప్పటికీ మంచి మానవ సమాజం కోసం జరిగే యత్నాలలో పాలుపంచుకోవడానికీ, నా వంతు సహకరించడానికీ సదా సిద్ధమని తెలియజేసుకుంటూ తెలుగులో బౌద్ధ వికాసం కొరకు జరుగుతున్న యత్నాలకిది కించిత్తు స్ఫూర్తినిచ్చినా, అంతకు మించిన సార్థకత ఈ కృతికింకేదీ ఉండబోదని మరోసారి చదువరులకిలా విన్నవించుకుంటూ, అర్థవంతమైన ఆచరణకు స్వాగతం, సెలవు.



విభాగంలో Ven. Pidivelle piyatissa చర్చిస్తారు. చూడు : An Exposition of Buddhism p-38. The Corporate Body of the Buddha Educational Foundation, Taiwan. అలాగే, "While there is great deal of similarity between the method of the Buddha and the rationalist-emppriricist method which underlines modern science it must not be thought that the Dhamma is a simple rationalism or a science in the modern sense of the term" అంటారు 'Buddhism a Rationalist Perspective' అనే వ్యాసంలో ఆస్ట్రేలియాలోని విక్టోరియా విశ్వవిద్యాలయ విశ్రాంత ప్రొఫెసర్ Victor Gunasekara. చూడు : Rationalist Voice, Buddhist Special, issue 3,4 & 5 Editor : Late M. Subbarao, Hyderabad - 2007.